# శ్రీమద్రామాయణము

## మానవధర్మము






రచన :

డా॥ మోపిదేవి కృష్ణస్వామి M.A., Ph.d.



ప్రచురణ :

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్ట్

విశాఖపట్నం

ప్రథమ ముద్రణ : మేకాల్ -1990

ప్రతులు : రెండువేలు



వెల : రు. 16



ప్రతులకు :

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్
23-10-7, పురుషోత్తం వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ-11.

ముఖచిత్రం : బాలి

ముద్రణ :
నిర్మలా ప్రింటర్స్,
విజయవాడ.



కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరునికి కలకాలం నిలిచిపోయే
ఈ కృతి సమర్పితము

# ఇందులో

# రెండు మాటలు

'రామాయణ, మహాభారతాలు అనంతకాల ఇతిహాసాలు. భరతవర్ష యావజ్జీవన యాత్రా, సాధనా, ఆరాధనా, విద్యా, విజ్ఞానమూ అన్నీ సమీకృతమై, ఈ కృతులలో ఇతిహాసరూపం ధరించి ఉన్నవి.... ....తన గుణములు మహనీయములు కాగా, మానవుడు దేవతయై దీపించినాడు రామాయణంలో .... గృహస్థాశ్రమం మానవుణ్ణి యదార్థమైన పురుషోత్తమునిగా, తయారు చేస్తుంది. భారతదేశ సంఘ వ్యాల్లభ్యానికి గృహస్థాశ్రమమే పునాది. అదిగో, ఆ గృహస్థాశ్రమ సచ్చరితమే రామాయణ మహాకావ్యం.... శాంతి రసాస్పదమైన ధర్మమును కరుణాశ్రువారితో అభిషేకించి, మహనీయ వీరపీఠము మీద ప్రతిష్ఠించింది రామాయణం .... ఇంత ఎందుకు ? భారతజాతి త్రికరణశుద్ధిగా ఏది కాంక్షించిందో, దానిని సంపూర్ణంగా పొందినది, పొందుతున్నది రామాయణములోనే.... 'వాల్మీకి రామచరిత్ర పరిపూర్ణమైన మానవధర్మ చరిత' అన్న విశ్వకవి రవీంద్రుని అమృతసూక్తికి భాష్యంగా భాసిస్తున్నది డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారి రామాయణ ప్రవచన పరంపర.

ఉదాత్తమానవధర్మానికి సజీవ రూపకల్పన రామాయణం. ఆ మహాకావ్యంలో అభివర్ణితములైన సౌభ్రాత్రం, సత్యవ్రతం, పాతివ్రత్యం, ప్రభుభక్తివంటి మానవ లక్ష్య లక్షణాలు లోపించేపక్షంలో — మానవసభ్యత 'ధూళి, ధూమ సమాకీర్ణమైన కర్మాగారంలో, కష్టజనజాత నిశ్వాస కలుషిత బద్ధాకాశంలో' క్రమంగా రూపుమాసి, క్షీణించిపోతుంది. మన సమాజంలోని ఇలాంటి స్థితిని గుర్తించిన శ్రీ కృష్ణస్వామి గారు అందుకు విరుగుడుగా రామాయణంలోని మానవధర్మాన్ని వివిధ కోణాలనుండి దర్శించి, తమ దర్శనాన్ని శ్రోతలకు అందించారు - అందంగా, భావబంధురంగా, రసార్ద్రంగా.

ఈ ప్రవచనాలలో పాండితీ ప్రకర్షను ప్రదర్శించే ప్రయత్నంలేదు. వాల్మీకం నుండి, రామాయణ భాష్యకాదుల నుండి 'కొటేషన్లు' లేవు. సామాన్యుణ్ణి తికమక

పఠించే వేదాంత చర్చ, ధర్మశాస్త్ర పరిభాష లేవు. ఉన్నవల్లా ఆయా మానవగుణాలను, వాటిని ప్రతిబింబించే రసవత్తర సన్నివేశాలను ఆర్ద్రంగా, అనుభూతిప్రదంగా తేట తెలుగులో అందించడం; ఆధునిక జీవితంలోని స్థితిగతులకు వాటిని అలవోకగా అన్వయించి, ఆ పాత్రలనూ, ఆయా గుణగణాలనూ, శ్రోతలకు సన్నిహితం చేయడం; అలా శ్రోత హృదయాన్ని ఆర్ద్రించేసి, ఆ స్నిగ్ధస్థితిలో రామాయణగాథ లోని మానవతా సందేశాన్ని 'ఆ హృదయంపై చెరగని విధంగా ముద్రించడం; నేనూ ఆ మహనీయగుణాలను అలవరచుకోవాలి.' అనే సహజప్రేరణను కలిగించడం.

ఈ ప్రవచనాల వెనుక – సనాతన ధర్మసారాన్ని ఆధునికులకు అందించాలనే ఉదాత్తమైన తపన ఉన్నది. నేటి యువతరం ఆ ధర్మాన్ని అందుకొని, తమ జీవితా లలో నింపుకొని, జాతి పునర్నిర్మాణానికి నడుంకట్టే స్వచ్ఛంద సేవకులుగా, తమను తాము మలచుకోవాలనే మహత్తర ఆకాంక్ష ఉన్నది.

ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ జి. శ్రీరామమూర్తిగారి సౌహృద సౌజన్యాలు కారణంగా రామాయణంలోని ఈ మానవతాసందేశం తెలుగునేల నాలుగు చెరగులకూ పరివ్యాప్తమయింది. నేడీ ప్రవచనాలు గ్రంథరూపం ధరించడంతో - ఆ సందేశం తెలుగు పాఠకలోకానికి నిత్యం 'వెలుగుచూపే కరదీపికగా, ఎల్లవేళలా తోడునీడయి నిలిచే ప్రాణమిత్రుని ఆప్తవాక్యంగా రూపుదిద్దుకుంటూ ఉండడం ముదావహం.

రామాయణ హృదయానికి సింహద్వారంగా, మానవ ధర్మశిక్షణకు, జీవద్వాహికగా ఈ సంకలనం ఉపకరిస్తుందని నా విశ్వాసం.

శ్రీ కృష్ణస్వామి గళం ప్రజలకు ఎంతగా పరిచయమో, వారి కలంకూడా ప్రజలకు అంతగానూ పరిచయం. ఇలా గళాన్ని, కలాన్ని సమపాళంగా నడప గలిగినవాళ్ళు మనకు చాలా అరుదుగా కనిపిస్తారు. 'భారతం-ధర్మాద్వైతం' అనే సిరి ప్రయోజనాత్మకమైన పరిశోధనా గ్రంథం అటు పెద్దల ఆమోదాన్ని, ఇటు సామాన్యుల ఆదరణను కూడా అమితంగా పొందుతున్నది. భాగవతానికి వీరు ఇస్తున్న ప్రవచనాత్మకమైన వివరణ ప్రతి మంగళవారం ఆంధ్రపత్రిక దినపత్రికలో

ప్రచురింపబడుతూ 'శ్రీమద్భాగవతము - దివ్య జీవనమార్గము' అనే పేరున సంపుటాలుగా వెలువడుతున్నది. మాష్టరు ఇ.కె. జీవిత సన్నివేశాలను, సందేశాలను ఒక ప్రత్యేకమైన పద్ధతిలో క్రోడీకరిస్తూ 'దర్శనాలు – నిదర్శనాలు'గా రెండు భాగాలను, 'అక్షరాల్లో అనుభూతులు'గా నాల్గు భాగాలను; 'సరసాల్లో నవరసాలు'గా మూడు భాగాలను వీరిప్పటికి వెలువరించారు. వీరి నుండి దిగివస్తున్న సందేశం 'మాటలా మంత్రాలు'గా: 'స్వామి పలుకులు -స్వాతి చిలుకులు'గా: 'మాటలమధ్యలో రాలిన ముత్యాలు'గా క్రోడీకరింపబడుతున్నాయి. ఇలా వీరినుండి ఇప్పటికి సుమారు ముప్పై రచనలు వెలువడినాయి.

డాక్టరు కృష్ణస్వామి జీవిత సన్నివేశాలు, ప్రవచనాలు, రచనలు అన్నీ భారతీయ సంస్కృతిలోని చిరంతన మూల్యాలకు, సజీవ వ్యాఖ్యానాలూ, ఆధునిక భాష్యాలు, సముజ్వల ప్రతిబింబాలు

— కందర్ప రామచంద్రరావు.

# ఆహ్వానము - అవతరణము

మనిషికి తనను గురించి, తనకు రూపుదిద్దిన ఈ సృష్టిని గురించి తెలుసుకోవాలన్న తపన కలిగింది. క్రమంగా ఆ తపన తపస్సుగా పరిణమించి, అతడిని ఒక మహర్షిగా నిలబెట్టింది. మహర్షిగా నిలబడిన మనిషి, విచ్చుకున్న తన జ్ఞాన నేత్రంతో ఈ సృష్టి తత్త్వాన్ని అధ్యయనం చేయసాగాడు. ఆ అధ్యయనం అనుభూతిప్రదంగా సాగింది. ఆ అనుభూతి అతడినుండి ఒక దివ్యగానంగా వెలువడింది. అలా వెలువడిన ఆ దివ్యగానమే వేదోపనిషత్తులుగా రూపుదిద్దుకొని సకలమానవాళికీ చేరువయింది.

వేదదర్శనాన్ని అందుకున్న ఋషి పరంపర అటుపైన మరొక అధ్యయనాన్ని ప్రారంభించింది. 'భగవంతుడు ఈ సృష్టిగా ఎలా వ్యక్తమవుతున్నాడు' అన్నది మనం దర్శించాం. 'సృష్టిగా వ్యక్తమవుతున్న భగవంతునితో మానవుడు శ్రుతి కలపడం ఎలా? అన్నది ఇక మనం కనుగొనవలసి ఉన్నది' అని ఆ ఋషి పరంపరకు అనిపించింది. ఆ అధ్యయనానికి ఫలితంగానే స్మృతులు రూపు కట్టుకున్నాయి. 'స్మృతులు' అంటె ధర్మశాస్త్రాలు. మానవుడు సృష్టి తత్త్వంతో శ్రుతి కలపడానికిగాను తనను, తన జీవితాన్ని ఎలా నియమించుకోవాలో తెలియజెప్పే శాస్త్రాలివి.

శ్రుతి అంటే వేదం. స్మృతి అంటే ధర్మశాస్త్రం. మానవుడు శ్రుతి చూపిస్తున్న మార్గంవెంట నడిచేటందుకు చిత్తశుద్ధితో ప్రయత్నించిన నాడు శ్రుతి అందిస్తున్న దివ్యదర్శనం చెంతకు చేరుకుంటాడు. కాని, ఋషిపరంపరకు ఇక్కడే చిన్న ఇబ్బంది వచ్చింది. 'ఇలా నడుచుకోవాలి' అని చెబుతున్నారు ఋషులు. 'ఎలా నడుచుకోవాలి' అన్నది ఏమిటోమరి ? మాకు పూర్తిగా అంతుపట్టడం లేదు-అన్నట్లు చూస్తున్నారు జనులు.జనుల స్థితి ఋషులకు బోధ పడింది. వారప్పుడు వేదస్వరూపుడైన దైవం వైపుకు చూశారు. దైవం ఇలా అన్నాడు: పరిస్థితిని గమనించాను. 'ఓ మహర్షులారా! మీరు చేయవలసిందంతా చేశారు. ఇక నేనుచేయవలసిందే మిగిలింది. మీరందిస్తున్న శ్రుతి,స్మృతులను ఎలా అందుకోవాలో నిత్యజీవితంలో వాటిని ఎలా సమన్వయించుకోవాలో సకల మానవాళికీ తెలియజెప్పే బాధ్యతను నేను స్వీకరిస్తాను. అందుకుగాను నేను మానవుడిగా దిగి వస్తాను. మనుషులలో మనిషినై సంచరిస్తూ, మనిషి తన జీవితాన్ని ధర్మమార్గాన ఎలా నడుపుకోవాలో నడిచి చూపిస్తాను. మీనుండి జరిగిన కృషి, అప్పుడు వారికి చక్కగా బోధ పడుతుంది. నిత్యజీవితంలో వారికి అక్కరకు

వస్తుంది. వారి జీవితాలను నిత్యమూ వెలిగిస్తుంది. మహర్షులారా! దివ్యమైన మీ కృషిని ఆచరణీయమైన మార్గంలో మానవాళికి అందించడం నా బాధ్యతకాదా!'

'ఋషివరులారా! మీ శరీరాలను వేదికలుగా చేసికొని ఎంతెంత తపస్సులు చేశారు మీరు! మానవజాతికోసం ఎంతగా తపన పడ్డారు మీరు! ఎంతగా తపించి పోయారు! మీ జీవితాలలో మీదన్నది ఏదైనా ఉన్నదా? లోకహితం తప్ప మీరు కోరేది ఇంకేమయినా ఉన్నదా? మిమ్మల్ని చూస్తుంటే నాకాశ్చర్యం వేస్తుంది. నాకానందం కలుగుతుంది. అలాంటి మీరు, సకలజనుల శ్రేయస్సునుకోరి నిర్దేశించిన ధర్మసూత్రాలను, రూపొందించిన జీవన విలువలను తరతరాల మానవులు తలచే టందుకు వీలుగా, నేనుగా దిగివచ్చి, నా జీవితాన్నే మీ ఉపదేశసారంగా మలచి అందిస్తాను. మహర్షులారా! సంతోషమేనా?'

'మీ రడిగిన దానికి కాలం అన్నివిధాలా కలసివచ్చినట్లున్నది. అదుగో రావణుడు! రాజసంతో రాక్షసుడై విజృంభిస్తున్నాడు. ఋషి పరంపరపైన రక్తవర్షాన్ని కురిపించే ఏర్పాట్లలో మునిగి తేలుతున్నాడు. మీ తపస్సు లోకహితాన్ని సాధిస్తుంటే, అతడు తన తపస్సుతో ఒక లోక కంటకుడు కాగలిగాడు. చిత్రంగా లేదూ!? మిమ్మల్నే కాదు, దేవతల్ని కూడా అతడు తన పదఘట్టనల క్రింద నలిగిపోయేటట్లు చేస్తున్నాడు. సృష్టి నిలబడాలని మీరు చూస్తుంటే, సృష్టిని తలక్రిందులు చేయడ మెలాగ? అని అతను చూస్తున్నాడు. మహర్షులారా! నేనది గ్రహించాను.'

అదుగదుగో పరశురాముడు. సత్క్షత్రియుడు కనబడేవంత వరకు, కనబడిన ప్రతి క్షత్రియుని అనగా ప్రతి రాజును తన గొడ్డలికి అప్పచెప్పుతానని, పట్టుపట్టి తిరుగుతున్నాడు. రక్షకులుగా ఉండవలసిన రాజులు భక్షకులుగా రూపొందడాన్ని అతడు సహించలేక పోయున్నాడు. ప్రజలను కాచుకోవలసిన ప్రభువులు ఆ ప్రజలనే కొల్లగొట్టే దుర్భరస్థితికి దిగజారడాన్ని అతడు భరించలేక పోతున్నాడు. భూమి అంతా తిరిగి-తిరిగి ఈ కార్యక్రమంలో అలసిపోయిన అతనికి తృప్తికలిగించవలసిన బాధ్యత నాపై ఉన్నది. ఒక సత్క్షత్రియుడిగా రూపు దిద్దుకొని, అతని హృదయానికి సేద తీర్చవలసిన ఆవశ్యకత నాకున్నది. ఋషులారా! కాలము కలసి వచ్చినట్లున్నది.

ఇలా, ఇప్పటికి కావలసిన పనులన్నింటినీ చక్కబెట్టడానికీ, ఎప్పటికీ కావలసిన ధర్మాన్ని నా జీవితరూపంలో వ్యక్తం చేయడానికీ నేను దిగి వస్తున్నాను. తల్లి దండ్రులకు బిడ్డనై, తల్లిదండ్రుల-బిడ్డల మధ్యన పెరిగే మమకారాన్ని ఇలా

ధర్మబద్ధంగా మలచుకోవాలో చూపిస్తాను. అన్నదమ్ములలో ఒకడినై, అన్న-దమ్ముల అనుబంధంలోని ఆత్మీయతనూ, దివ్యత్వాన్నీ రుచిచూపిస్తాను. గురువునకు శిష్యుడనై, గురు-శిష్యుల అనుబంధంలోని గాఢత్వాన్ని తెలియ చెబుతాను. వివాహం చేసుకొని, భర్తనై భార్యా-భర్తల అనుబంధంలోని మాధుర్యాన్ని అనుభవిస్తూనే, దివ్యమైన దాంపత్యం ధర్మాచరణకు ఎంతటి అవకాశంగా పరిణమించగలదో చాటిచెబుతాను. మనస్సుకు దగ్గరయిన వారికి స్నేహితుడనై, ఆ స్నేహంలో తీయదనాన్ని ఆస్వాదిస్తూనే, స్నేహమంటే ఎంతటి విలువైనదో, ఎంతటి పవిత్రమైనదో నా జీవన వైఖరులద్వారా వ్యక్తంచేస్తూ, అది లేకపోతే మానవ జీవితానికి రుచే లేదనీ, కనుక ఆ రుచిని పవిత్రంగా రక్షించుకోమని హెచ్చరిస్తాను. హృదయానికి దగ్గరై ఆరాధించే వారిని నా హృదయంలో పదిలంగ ఉంచుకుంటూ, నేనే వారుగా, వారే నేనుగా అనుభూతిని చెందుతూ, వారి జీవితవైఖరుల ద్వారా తరతరాల వారికి తరుణోపాయం అందేలా చూస్తాను. అధర్మమార్గాన్ని అవలంబించడంద్వారా లోకకంటకులుగా రూపొందుతూ, దుర్జనులైనవారు నాకు శత్రువులై తారసపడిన వేళ శత్రువును ఎలా చూడాలో, శత్రుత్వానికి ఎలాబదులు చెప్పాలో నా జీవిత సన్నివేశాలద్వారా చూపి, నరజాతికి, శత్రువును ద్వేషించకుండానే శత్రుత్వాన్ని ఎలా పరిష్కరించవచ్చునో నేనుగా నేర్పుతుంటాను. ఇలా మానవధర్మంలోని అన్ని కోణాలను నా జీవితంతో తడిమి, అవి ఎలావుంటే బాగుంటుందన్నది నరజాతికి స్పష్టం చేస్తాను.

తరతరాల మానవులకు అక్కరకు వచ్చేలాగున నా అడుగుజాడలను పదిలపరచి అందించేటందుకు మీ ఋషి పరంపర కావలెనని ఉన్నదని నాకు తెలుసును. వేదాలను నిరంతరం గానంచేసే, మీ గొంతులతో నా జీవితాన్ని గానంచేసి, దానినొక వేదకావ్యంగా, ఒక కల్పవృక్షంగా, మీరు రూపొందించగలరని నాకు తెలుసును. అప్పుడు నేనేం చేస్తానో తెలుసునా ? ఆ కావ్యమే నారూపంకాగా, చిరకాలం నరుల హృదయాలను మీటుతుంటాను. వారిని ధర్మనిష్ఠులుగా, కర్తవ్యపరాయణులుగా మలచుకుంటాను. ఋషివరులారా! వ్యక్తం కాబోతున్న నా మానవజీవితాన్ని, కావ్యరూపంలో చిరంజీవం చేయబోతున్న మీకు నా కృతజ్ఞతలు.

దేవుని పలుకులకు ఋషిలోకం పరవశించి పోయింది. మన కృషిని సార్థకం చేయడానికి మానవుడిగా దిగి వస్తున్నాడు దేవుడు. సకల ధర్మాలకూ, తన జీవితాన్ని ఆటపట్టు చేయబోతున్నాడు. నిత్యజీవిత నిర్వహణలో మానవుడికి కావలసిన ధర్మ సమన్వయాన్ని తన జీవితంద్వారా సువ్యక్తం చేయబోతున్నాడు. అతడి దివ్యజీవితాన్ని

కావ్యంగా గానంచేసే మహదవకాశాన్ని మన కనుగ్రహించబోతున్నాడు. ఆ జీవితం యథాతథంగా గానం చేయబడాలి. ఆ గానం ఆచంద్రతారార్కం నరజాతికి తోడునీడై రక్షించుకోవాలి. అని అనుకుంటూ ఋషిలోకం మరింత పరవశించి పోయింది. ఆ పారవశ్యం దేవుడు రాముడై భూమిపై నడిచినవేళ వరకూ, అతడి జీవితం రామాయణ మహాకావ్యంగా గానం చేయబడేటంత వరకూ అలాగే కొనసాగింది. లోక కల్యాణానికి శాశ్వతమైన బాటను తీర్చింది.

విజయవాడలో శివరామకృష్ణ క్షేత్రమని ఉంది. విజయవాడకు ఆయువుపట్టు వంటి క్షేత్రమిది. సకలదేవతలకు ఒక చక్కని కూడలి ఇది నిరంతరం ఏదో ఒక ఆరాధనా కార్యక్రమం జరుగుతూనే ఉంటుందిక్కడ. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం పెద్దలెవరో ఒకరు పవిత్ర గ్రంథాలను బోధిస్తూనే ఉంటారు. ఇక్కడ ప్రొద్దుగ్రాలే వేళకు వందలు, వేలుగా జనం రోజూ ఇక్కడకు చేరుకొని, పెద్దల మీదుగా దిగివచ్చే జ్ఞానగంగలో ఓలలాడుతూ ఉంటారు. ఇచ్చటి శ్రోతలు బహుశ్రుతులు 'ముఖే ముఖే సరస్వతీ' అన్నట్లుగా, ఎందరెందరో పెద్దలు ఎన్నెన్నో సూక్ష్మాంశాలను వివరిస్తూ వస్తుండగా, వాటి నన్నింటిని ఆకళింపు చేసుకుంటూ వస్తున్నవారు. అలాంటి శ్రోతలు విశాలమైన శ్రవణసదనం చాలక, ఆ క్షేత్రప్రాంగణం మొత్తాన్ని తమదిగా చేసికొని. బారులుతీరి ప్రసన్నచిత్తులై కూర్చునివుండగా, దివ్యమైన ఈ రామాయణ ప్రవచన యజ్ఞం 7-4-89 నుండి 14-4-89 వరకూ కొనసాగింది.

శ్రీరామచంద్రుడు తానుగా వ్యక్తమై, తన జీవిత కావ్యమైన రామాయణంలోని ధర్మమర్మాలను విప్పిచెప్పిన వేళ అది. రామాయణ మహాకావ్యాన్ని చదువుకొనే వేళలో చూపవలసిన కౌశలం ఎలాంటిదో తెలిపి చూపినవేళ అది. మానవధర్మంలోని వివిధ కోణాలను, వైఖరులను శ్రోతల మనస్సులకు పరమప్రేమతో, ప్రసన్నంచేసిన వేళ అది. రామకల్యాణంలో జగత్కల్యాణం ఎలా యిమిడివున్నదో విప్పిచెప్పిన అమృత ఘడియలవి.

అలా, వేలాది సహృదయులను పరవశింపజేసిన ఈ ప్రయోజనకరమైన ప్రవచనాలు ఆంధ్రపత్రిక, దినపత్రిక ద్వారా అఖిలాంధ్ర ప్రజలకు చేరువై ఆంధ్రవనిని రామమయంగా రూపొందించాయి. ఇప్పుడు గ్రంథ రూపాన్ని ధరించి, తెలుగవారి లోగిళ్లలో రామ కళ్యాణాన్ని జగత్కల్యాణంగా నిరంతరం నిర్వహింపజేయడానికి సంకల్పిస్తున్నాయి. కొద్ది సంవత్సరాలలో భారతీయ భాషలన్నింటిలోనికి అన

వదింపబడి, భరత భూమి పైన జరుగవలసి ఉన్న ధర్మ సంస్థాపన కార్యక్రమంలో తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించనున్నాయి.

ఈ శుభవేళలో ఈ ప్రవచనాలను కూర్పుచేసి అందించిన శ్రీ కందర్ప రామచంద్రరావ్‌గారికీ, వారికి సహకరించిన చి॥ సౌ॥ పార్వతికీ, అమితమయిన ఆదరముతో వీటిని కావాలని కోరి ఆంధ్ర ప్రజలందరికీ అందించిన, ఆంధ్రపత్రిక సంపాదకవర్గానికీ, గ్రంథంగా రూపు ధరిస్తున్న వేళ సన్నివేశాలకు తగిన చిత్రాలను రూపకల్పన చేసి ఇచ్చిన ప్రియసోదరుడు బాలికీ, గ్రంథ ముద్రణ వ్యయంలో మనసున్న మనిషిగా పాలుపంచుకున్న సోదరుడు శ్రీ సోమిశెట్టి సాంబశివరావ్‌కూ, ముద్రణ కార్యాన్ని శ్రద్ధగా నిర్వహించిన నిర్మలా ప్రింటర్స్ సోదర వర్గానికీ నా శుభాకాంక్షలందచేస్తున్నాను.

'శ్రీమద్రామాయణము - మానవ ధర్మము' అనే పేరుతో వెలువడుతున్న ఈ దివ్యగ్రంథం మన మనస్సులకు మానవధర్మంలోని మాధుర్యాన్నీ, గాంభీర్యాన్నీ, పవిత్రతనూ, పరమార్థాన్నీ ప్రసన్నమగునట్లుగా చేసి, మనజీవితాలను రామమయంగా రూపొందించి, మనలను ధన్యులను చేయుగాక!

26-3-'90,

విజయవాడ. మోపిదేవి కృష్ణస్వామి.



# గురు శిష్యుల అనుబంధం

యాగరక్షణకోసం విశ్వామిత్రునివెంట బయలుదేరారు రామలక్ష్మణులు. సరయూ నది వద్దకు వచ్చారు. శుచిపై బల, అతిబల మంత్రాలు స్వీకరించు అన్నాడు విశ్వామిత్రుడు. స్వీకరించిన తర్వాత - 'ఇప్పుడు నీవు సర్వసమర్థుడవైనావు. ప్రపంచంలో ఏకైక వీరుడవు అయినావు. నీకు సద సత్ వివేకం కలుగుతుంది. సంధానం చేస్తున్నప్పుడు అనితరసాధ్యమైన తేజస్సు నీనుండి వ్యక్తమవుతుంది' అన్నాడు మహర్షి రామునితో.

గురువు ఆజ్ఞ నిర్వహణకు, జగత్ కళ్యాణ కార్యానికి నడుంకట్టిన వేళ సర్వ శక్తులూ అతడికి సంక్రమించాయి. శక్తియుక్తులు ఎప్పుడూ ధర్మ రక్షణకోసం నిల బడినవాడికి, మహనీయుల వాక్య నిర్వహణకు ఉద్యమించినవాడికి వాటికవిగా నడచి వస్తాయి.

మరో ఘట్టం, "కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం"- అంటూ తెల్లవారుజామున రాముడిని మేలుకొలుపుతున్నాడు మహర్షి. గురు-శిష్య సంబంధంలో ఉన్న ప్రేమను, ఆత్మీయతను ఆయన చూపుతున్నాడు. శిష్యుడు గురువును ఆరాధిస్తాడు. గురువు శిష్యుడిని ఆరాధిస్తాడు. ఇదే సన్నివేశం మనకు రామకృష్ణ - వివేకానందుల విషయంలో కూడా గోచరిస్తుంది.

అలా ఆరాధిస్తూ, ఆనందిస్తూ, పరవశిస్తూ నిద్ర లేపుతున్నాడు మహర్షి. అత డెవరో తెలిసి నిద్ర లేపుతున్నాడు. ఏ సుప్రభాతం చదివినా మొదటి శ్లోకం ఇదే. ఎందువల్ల ? దేనికోసం అతడు నిద్ర లేపుతున్నాడు ?

ప్రతి ఒక్కరూ దైవతత్త్వమే, దైవాంశమే. మానవత్వమనే తెరవెనుక ప్రతి ఒక్కరూ దైవము యొక్క ప్రతిబింబమే. ఆ దైవతత్వాన్ని మేలుకొలుపుతున్నాడు. నీ నిజస్వరూపాన్ని తెలుసుకోవయ్యా - అంటూ మేలుకొలుపుతున్నాడు. 'దేవతల కార్యాలు నిర్వహించడానికి దిగివచ్చావు. కనుక నిద్రలే' అని మేలుకొలుపుతున్నాడు.

ఆ తర్వాత గురుశిష్యుల కథ మొదలైంది. స్థాణ్వాశ్రమం ముందు అగాడు. ఆశ్రమం కథ ఏమి ? అంటే ఆయన అన్నాడు- 'ఒకప్పుడు పరమశివుడు తపస్సు చేస్తున్నాడు. దాన్ని చెడగొట్టడానికి మన్మధుడు వచ్చాడు. శివుడు మూడో కన్ను తెరిచాడు. మన్మధుడు దగ్ధమైనాడు. మన్మధుడు అంగములు కోల్పోయిన దేశం కనుక ఇది అంగదేశం అయింది.'

ఇక అక్కడ నుండి వాళ్ళ ఒక్కొక్క స్థలం, ఒక్కొక్క నది దాటుతూ ఉంటారు. ఇదేమిటి అని వాళ్ళ అడుగుతూ ఉంటారు. ఆయన చెపుతూ ఉంటాడు.

శిష్యుడిని ఎడ్యుకేట్ చేయడం అంటే ఇదే. కూర్చోబెట్టి బలవంతాన రుద్దడం ఎడ్యుకేషన్ కాదు. నడుస్తూ, వర్తిల్లుతూ, నిర్వహిస్తూ, నిర్దేశిస్తూ, కర్తవ్యాన్ని బోధిస్తూ, వారు ఏది ఇష్టమై అడిగితే దానిని విప్పిచెపుతూ వెళ్ళిపోవడం ఎడ్యుకేషన్.

అరవింద మహర్షి దానిమీద రిసెర్చ్ చేసి, మరల విశ్వామిత్రుని దగ్గరకే వచ్చాడు. ది లాస్ట్ స్కూల్ అనే పాఠశాలను ప్రారంభించాడు. శాస్త్రీయ అంశములు, పరికరములు అనేకం ఉన్న ఒక ప్రాంగణంలో పిల్లలను వదలివేయమన్నాడు. వారివెంట వారికి తెలియకుండా గైడ్స్‌గా ఉండి, వారేవి అడిగితే దానిని వివరించమన్నాడు.

ఇలా కాక-మనమేదో సిలబస్ వారి నెత్తిన రుద్దితే, వారు మనకొరకు ముక్కున పట్టుకొనివచ్చి వ్రాస్తున్నారు తప్ప-వారు బాగుపడడం జరగదు. మార్కుల కోసం, డిగ్రీలకోసం, పొట్టకూటికోసం చదువుతారు తప్ప-తమ కొరకు చదవరు. మనకొరకు చదవడం మానివేసినప్పుడు - ఈ విద్యపై మనం వేసే పథకాలు, మనం కట్టే భవనాలు అన్నీ వృథా.

"స్వామీ, ఇక్కడేవో పట్టణాలు ఉన్నాయి అవి ఎలా వచ్చాయి?"

"నాయనా, పట్టణాల రూపురేఖలు ఉన్నాయి కానీ ఇక్కడ కీకారణ్యాలే ఉన్నాయి. ఒకప్పుడు ఇవి మల, కరూశ పట్టణాలు. ఇంద్రుడు వృత్రాసురుడిని చంపాడు. బ్రహ్మహత్యపాతకం చుట్టుకున్నది. అశుచి అయినాడు. వెర్రి ఆకలితో

బాధపడుతున్నాడు. దేవతలు గంగనీరు అందించి అతడి బెంగ తీర్చారు. ఆ పాపం క్షాళన అయినందుకు చిహ్నంగా ఇక్కడ రెండు పట్టణాలు ఉండేటట్లు ఆయన సంకల్పం చేశాడు. కాని తరువాత ఆ పట్టణాలు తాటకి ప్రభావంచేత కీకారణ్యాలు అయినాయి."

ఈ వృత్రాసురుడి కథ ఏమి? చాల పెద్ద కథ. వ్యక్తి నిర్మాణం నుండి సృష్టి నిర్మాణం వరకు అతడు అలా చుట్టలు చుట్టుకుంటూనే ఉన్నాడు. ఇంద్రుడిని మ్రింగుతూనే ఉన్నాడు. ఆ ఇంద్రుడు వజ్రాయుధంతో అతడిని కొడుతూనే ఉన్నాడు. ఇది ఒక శాశ్వతగాథ. అందరమూ ఎప్పుడో ఒకప్పుడు ఆ వృత్రాసురుడిని వధించక తప్పదు. సంకేతాలున్నాయి ఈ కథలో.

"ఏమండీ తాటకి అంటున్నారు? ఆమె స్త్రీ కదా. ఇంత కీకారణ్యంగా మార్చిందేమి ?"

"నిజమే బాబూ. నిజానికి ఆమె ఒక యక్షిణి. అగస్త్యుడిని అతడి సంతతిని మట్టుబెట్టడానికి ప్రయత్నించడంవల్ల రాక్షసి అయింది."

"దీని అర్థం ఏమిటి ? రాక్షస ప్రవృత్తులు కలిగినవారు క్రమంగా రాక్షసులు అయిపోతారు. మనిషికి ఒక దుష్టభావన కలిగితే, క్రమంగా అతడి కళ్ళు, రూపురేఖలు మారిపోతాయి. వికృతరూపం వచ్చేస్తుంది. అలాగే, దుష్టుడైన వాడికి ఒకమంచి ఆలోచనవస్తే అతనికి క్రమంగా మనకు నమస్కరించాలనిపించే రూపంవచ్చేస్తుంది.

"ఆనాటినుంచి ఈనాటివరకు ఆమె, ఆమె సంతతి మన యజ్ఞములకు, విఘ్నములు కలిగిస్తున్నారు. ఇప్పుడు నీవు తాటకిని వధించాలి."

"స్త్రీని వధించడం తప్పంటారు కదా ?"

"జాతి మొత్తాన్ని పీడిస్తున్న వ్యక్తి స్త్రీ అయితే ఏమి, పురుషుడయితే ఏమి ? జాతి రక్షణకోసం ఆ భేదాలకు అతీతంగా వారిని వధించడం సనాతన రాజధర్మం."

"మీ ఆజ్ఞమేరకు తాటకిని వధిస్తున్నాను."

తాటకి వచ్చి మీద పడుతున్నది. రాముడు అస్త్రాలను సంధిస్తున్నాడు. సాయం సమయం దాటితే ఆమెను వధించలేరు. రాముని మనసులో జాలి. ఆమె కాళ్ళు, చేతులు తెగిపోయేటట్లు బాణాలు వేశాడు. అయినా తాటకి కామరూపంతో విజృంభిస్తోంది. 'రామా త్వరపడు. నీ మనస్సులోని ఆ కాస్త జాలిని తీసివేయి' అన్నాడు మహర్షి. తాటకి వధ జరిగింది.

దేవేంద్రునితో సహా దేవతలంతా వచ్చి అభినందించారు. దేవేంద్రుడు మహర్షితో అన్నాడు- 'మీవద్ద ఉన్న అస్త్ర శస్త్ర విద్యలన్నింటినీ ఇతడికి ఉపదేశించండి'. విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వాడు.

ఇందులోని పరమార్థం ఏమిటి? ధర్మకార్య నిర్వహణకు మనం నిలబడ్డవేళ శక్తియుక్తులు వాటికవిగా మనవద్దకువచ్చి చేరుతాయి. పనివల్ల మనకు శక్తి వస్తుంది. మన శక్తివల్ల పని జరగదు. మనలో కావలసిందల్లా సంసిద్ధత. లోక కళ్యాణంకోసం నిలబడ్డవారికోసం దేవతలు బాధ్యత పడతారు. సాధనచేస్తూ- దేవుడు ఏమైనా సిద్ధులు ఇస్తాడా అని చూసుకున్నవాడు సంతకు వెళ్ళవలసిందే. ఎవరు ఈ సృష్టి యజ్ఞంలో పాలు పంచుకోవడానికి ప్రయత్నం చేస్తారో - వారి దగ్గరకు వారి ప్రయత్నంమేరకు వార్లికి కావలసిన శక్తియుక్తులు నడచి వస్తాయి, వరిస్తాయి.

మరునాడు భృశాశ్వ దత్తములైన అస్త్ర శస్త్రములను ఉపదేశించాడు మహర్షి. 'తండ్రీ, ఈ మంత్రాలను జపం చేసుకో, ప్రసన్నంచేసుకో' అన్నారు. రామచంద్రుడు అన్నిటినీ స్వీకరించాడు. ఆ అస్త్ర దేవతలందరినీ స్మరించాడు. వారు ప్రసన్నమైనారు. రాముడు అన్నాడు 'ఓ దేవతలారా, మీతో అవసరం వచ్చినప్పుడు నేను మిమ్మల్ని పిలుస్తాను అప్పుడు నాకు ఉపయోగపడండి. అప్పటిదాక మీరు స్వేచ్ఛగా తిరుగాడండి.'

ఇక్కడ విద్యార్థులకు ఒక ఉపదేశం ఉన్నది. నీ విద్యను కాని, నీ శాస్త్రమునుకాని లగేజీలా మోసుకుంటూ ఉంటే-నీవు కూలివాడవి. నీవు విద్యార్థివేమిటి? ఓ విద్యలారా! ఓ శాస్త్రములారా! నాకు అవసరమైన వేళన అక్కరకు రండి. అంతవరకు స్వేచ్ఛగా తిరుగాడండి-అన్నవాడు నిజమైన విద్యార్థి. కనుక విద్య మనవెంట పడాలి. మనం విద్యవెంట పడరాదు. మనకు అర్హత కలిగినవేళల విద్య మనవెంట పడుతుంది.

ఉదాహరణకు ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు హోమియో స్వంతంగా చదివారు. అది వారికి ప్రసన్నం అయింది. అలాగే, జ్యోతిర్విద్య, మానసికశాస్త్రం ఆయనకు ప్రసన్నమై లోకానికి వ్యక్తం అయినాయి. సకల శాస్త్రములకు ఆధునిక కాలానికి కావలసిన సమన్వయాన్ని ఆయన చేశారు. ఆయన అన్ని శాస్త్రములలో కృషి చేశారని కాదు. అన్ని శాస్త్రములు ఆయనను వరించి ఆయనకు స్వంతమైనాయి. లేకపోతే రోజుకు ఇరవై రెండు గంటలు ప్రజాసేవలో గడిపే ఆయనకు అంతటి తీరికఏది? విద్యలు మనదగ్గరకు రావాలి. మనం ఆ స్థాయికి ఎదగాలి.

ఎడ్యుకేషన్ అంటే మన బుర్రలో ఉన్నదానిని శిష్యుడి బుర్రలో పోయడం కాదు. శిష్యుడిని మేలుకొలపడం. శక్తులను ప్రచోదనం చేయడం - సూర్యకిరణం సోకిన వెంటనే పద్మం వికసించినట్లు-గురువు వీక్షణం పడడంతోనే శిష్యునికి సమస్త విద్యలూ ప్రసన్నం కావాలి.

అలా వెళ్ళి వెళ్ళి గురువు, శిష్యులూ సిద్ధాశ్రమంలో ప్రవేశించారు. విశ్వామిత్రుడు యజ్ఞదీక్షితుడు అయినాడు. రామలక్ష్మణులు ఇక ఆయనను పలకరించలేదు. ప్రక్కన ఉన్నవారిని అడిగారు - మా కర్తవ్యం ఏమిటని. ఆ రామలక్ష్మణుల విచక్షణాజ్ఞానానికి వారు ఆశ్చర్యపోయారు. స్వేచ్ఛను సద్వినియోగం చేసే శిష్యునికంటే ఏం కావాలి ? ఏడురోజులు అహోరాత్రాలు కావలికాయడం-అన్నారు వారు. శ్రీరామ బాణానికి సుబాహుడు చనిపోయాడు. మారీచుడు దూరంగా వెళ్ళి పడ్డాడు. యాగ సంరక్షణ పూర్తయింది.

ముగ్గురూ మిథిలా నగరం వెళతారు. శివధనుర్భంగం, సీతారామ కళ్యాణం జరుగుతాయి. విశ్వామిత్రుడు దశరథునికి రాముడిని పెళ్ళిచేసి మరీ అప్పగించాడు.

ఇలా గురుశిష్య సంప్రదాయానికి సమన్వయం, సమగ్రరూపం, పరిపూర్ణత్వం విశ్వామిత్రుడు-రామలక్ష్మణుల కథలో ఉంది. కామదహనంతో కథ మొదలుపెట్టి, ధర్మబద్ధమైన కామంకోసం తన శిష్యునికి వివాహంచేసి అతడిని అప్పగించినాడు విశ్వామిత్రుడు.

తన శిష్యునిచేత పరశురామ గర్వభంగం చేయించి, ఆ శిష్యుని మహోజ్వల రూపాన్ని చూపిన ఆ గురువునకు, ఆ గురువువద్ద శిష్యరికంలో పరిపూర్ణత్వాన్ని పొంది లోక కళ్యాణంకోసం సీతాదేవిచేయిపట్టిన శ్రీరామచంద్రునికి నమస్కరిద్దాము.



# తల్లిదండ్రులు - బిడ్డల అనుబంధం

జంతూనాం నరజన్మ దుర్లభం. ఎందువల్ల ? దైవతత్త్వాన్ని రుచిచూసిన వ్యక్తి ఆ దేవుని వెలుగులో తన జీవితాన్ని తీర్చిదిద్దుకున్నవేళ ఈ దేహం ధర్మస్వరూపమై తేజస్సును పొందుతుంది. నీ దేహం దేవాలయమై, హృదయగతుడైన ఆ దైవము ఆ దేవాలయం నుండి దర్శనం ఇస్తూ ఉంటే ఈ సృష్టి కథలో నీ పాత్రకు ధన్యత లభిస్తుంది. రామాయణాన్ని నిరంతరం చదువుకోవడం అందుకోసం. ఈ శరీరాన్ని అతడిని ప్రతిష్ట చేయడానికి ఒక విగ్రహంగా రూపొందించుకోవడం కోసం, సమర్పించుకోవడం కోసం.

తల్లిదండ్రులు-బిడ్డలు ఈ కథ ఏమి ? బ్రహ్మదేవుని నుండి సృష్టి దిగి వచ్చింది. ఆ బ్రహ్మ ఏం అంటున్నాడు ? నేను ఈ బొమ్మలను సృష్టిచేస్తున్నాను. ఈ బొమ్మలే బొమ్మలను తయారుచేసి కథ నడిపిస్తే అన్నాడు. ఈ సృష్టి శాశ్వతంగా నిలబడేందుకు స్త్రీ పురుష విభాగం చేసి, వాటి మధ్య ప్రేమ కలిగించి, బొమ్మలనుండి బొమ్మలను సృష్టించే ఏర్పాటు చేశాడు. కనుకనే వివాహాన్ని ప్రాజాపత్యం అనే యజ్ఞస్వరూపంగా చెప్పారు.

కనుకనే దశరథుడు అన్నాడు- 'బిడ్డలు లేని దాంపత్య సుఖానికి అర్థం ఏమిటి ? నాకు వారసులు కనబడడంలేదు.' వశిష్ఠాదులు ఆ లోటు తీరే మార్గం చూపారు. అశ్వమేధయాగం, పుత్రకామేష్టి నిర్వహించాడు. నలుగురు పుత్రులు జన్మించారు.

దాంపత్యం అనేది అలాంటి పుత్రకామేష్టి కావాలి. పరమార్థమైన క్రతువు కావాలి. అప్పుడు దిగివచ్చిన బిడ్డలు ఆ వంశానికి, లోకానికి పనికివస్తారు. తల్లిదండ్రులకు దివ్యస్థితిని కలిగిస్తారు.

మరి ఈ తల్లి-తండ్రి బిడ్డ మమకారాన్ని పెంచుకోవడం మంచిదా ? పిచ్చి వాడా, ఇవన్నీ కత్తిరించుకుందామా ? కత్తిరించుకోవడమే కరెక్ట్ అయితే నిన్ను ఇక్కడిదాకా ఎందుకు పంపాడు? ఈ సృష్టిలో అక్కరలేనిది ఏదీ ఉండదు. మమకారాలు ఉన్నాయి. సృష్టిలో అవి ఎందుకు ఉన్నవో తెలుసుకుని వానిని వినియోగించడం మనకు చేతకావాలి. అందుకే బిడ్డలయెడల ఆ మక్కువ. సనాతన ధర్మంలో దేనినీ వద్దనలేదు. దేనికైనా హద్దు ఉండాలన్నారు. మమకారాలు, ఆపేక్షలు, బంధుత్వాలు వీటిని పవిత్రీకరించుకునే మార్గం చూపారు. మమకారాలు, ఆపేక్షలు, ధర్మానికి ఒదిగి ఉండాలన్నారు.

దశరథునిది ఒక విచిత్రమైన వ్యక్తిత్వం. రామునిది ఒక విశిష్టమైన వ్యక్తిత్వం. రాముడి తరహాకీ, దశరథుడి తరహాకీ చాలా తేడా ఉన్నది. తండ్రీ బిడ్డలుగా వారున్నారు. మన మేమంటాం ఆ స్థితిలో ? మా నాన్న పద్ధతి నాకేం నచ్చడం లేదండీ - అంటాం. కాని రాముడు ఎప్పుడూ ఆ మాట అనలేదు. దశరథునికి మమకారాలను వినియోగించుకోవడంలో ఒడుపు తెలియదు పాపం. ఆ కారణం చేత అందులో కొట్టుమిట్టాడుతున్న దశరథుడికి మమకారాలను అదుపులో పెట్టుకోగలిగిన బిడ్డ కలిగాడు. ఆ బిడ్డ బిడ్డగా ఉండాలి. మళ్లీ తండ్రికి చెప్పాలి. అలా అని తండ్రిని ఎదిరించకూడదు. ఇవాళ సమాజానికి కావలసింవదే. మనకేమాత్రం బాధ కలిగినా అవతలవాడి వయస్సు చూడకుండా తిరగబడుతున్నాం. అదేమంటే స్వేచ్ఛ అంటున్నాం. రాముడలా అనలేదు.

దశరథునికి మూడో భార్య మీద మక్కువ. పెద్దకొడుకంటే మరీ ఇష్టం. ఆయనకు రాముడూ కావాలి, కైకా కావాలి. రాముడు చిత్రమైనవాడు. తానే ఎక్కువ భాగం కైక ఇంట్లో ఉండడం మొదలుపెట్టాడు. నాకు ఇంతకన్నా ఏమి కావాలి అనుకున్నాడు దశరథుడు.

ఆ రాముడు కైకేయి వద్ద విలువిద్య నేర్చుకున్నాడు. తల్లితో ఎలా ఉండేవాడో కైకేయితో అంతకన్నా ఎక్కువగా ఉండేవాడు. ఆ కైకేయికి భరతునికన్న రాముడే ఎక్కువ.

ఆ ప్రేమను సంపాదించి, కౌసల్యకు ఆశాకిరణమై, సుమిత్రకు ఆరాధ్య దైవమై మెలిగాడు.

ఆ కౌసల్యకు ఆశాకిరణం ఎందువల్ల? భర్త ప్రేమ ఆవిడకు తృప్తిగా లభించ

లేదు. కాని ఆవిడ పట్టమహిషి. ఆవిడను గ్రూప్ ఫోటోలకు మాత్రమే పిలిచే ఆయన. అనధికారమైన సన్నివేశములన్నిటిలో కైకేయితో ఉండేవాడు. అం రాముడు తండ్రి మమకారంపై కామెంట్ చేయలేదు. కామెంట్ చేయడానికి అక్కరలేదు. ఇంత రజోగుణ దోషం చాలు. కామెంట్ చేయకుండా ఉండ తపస్సు కావాలి.

కౌసల్య ఏమి అనుకున్నది? 'సాక్షాత్తు నారాయణుడు నాకు బిడ్డగా కలి ఇతడు యువరాజు అవుతాడు. మహారాజు అవుతాడు. కనీసం రాజమాతగా ఆ ఆనందిస్తాను.' ఈ ఆశాకిరణం చూస్తూ బ్రతుకుతున్నది ఆమె.

ఇంతలో విశ్వామిత్ర ప్రవేశం. మొదటి మమకారానికి దెబ్బ. 'దశ రాముడిని నాతో పంపాలి నీవు. యాగరక్షణ కోసం' అంటే అర్థం ఏమిటి? మమకారం ఉండడం మంచిదే. కానీ అతనిని లోకకళ్యాణం కోసం సమర్పించ ఉన్నది. నా బిడ్డను లోకకల్యాణం కొరకు దైవం నాకిచ్చాడు. అని గుర్తించు తల్లిదండ్రులు.

మరో ఘట్టం. దశరథుడు కైకేయి కోపగృహంలో ప్రవేశించాడు. అటు రాలైన భార్య, ఇటు ఇష్టుడైన కుమారుడు. రెండు మమకారాల మధ్య వచ్చింది. కైకేయి వరాలు అడిగింది. దశరథుడు రాముడు లేనిదే నేను బ్రతక నీకు తెలుసుకదా అన్నాడు. మమకారాన్ని మమకారంతో కోసేసి మాట్లాడాడు వైధవ్యాన్ని తెచ్చుకోవద్దు అన్నాడు. ఆమె పట్టు విడవలేదు. దశరథుడు మూ కున్నాడు. లేస్తున్నాడు. తెల్లవారుజాము అవుతున్నది. సుమంత్రుడు రాముడిని చుకు వచ్చాడు. కైక వరాల సంగతి చెప్పింది. ఆ మాట ఆయన నీతో చె పోతున్నారని చెప్పింది.

రాముడు అన్నాడు- దీనికోసం నీవు ఎప్పుడో దాచుకున్న వరాలా అడి తండ్రిని యాచించాలా? బిడ్డగా నన్ను ఆజ్ఞాపించలేవా నీవు? రాముని మనస్సు తెలియదా?

అంతటి కైకేయి కూడా అలా నిలబడిపోయింది. మమకారాలను అ వేయడం ఎలా? తల్లిదండ్రుల, బిడ్డల అనుబంధాన్ని అంచనా వేయడం ఎలా రథుడు చూస్తున్నాడు. ఇతడు కొడుకా, కర్మమయుడా, దేవుడా? ఇతడికి అక్కరలేదా? ఒక్కటి కావాలి. ధర్మం కావాలి. నీకు రాజ్యం, భోగం, కీర్తి, ష్టలు కావాలా? అంటే నాకు ధర్మం కావాలనేవాడు రాముడు.

అప్పుడు కైకేయి రామునితో అన్నది అంగీకరించావు కనుక చెపుతున్నాను. నాయనా! నీవు ఇక్కడ ఉంటే భరతుడు రాజ్యాభిషేకం చేసుకోడు. కనుక వెంటనే అరణ్యాలకు వెళ్ళిపో. అవశ్యం అని ఇవతలకు వచ్చేటప్పటికి క్రుద్ధుడైన లక్ష్మణుడు అన్నాడు. ఇది అన్యాయం, అక్రమం, దగా, మోసం. ఈ ముసలివాడు కామాంధుడై ఈపని చేయడం ఏమిటి? అన్నా, కామాతురుడై ఆయన చేసిన పనికి నీవు కట్టుబడతావా? అలా జరగడానికి వీల్లేదు.

లక్ష్మణుడూ కొడుకే. అతడు కొంచం మనవంటివాడు. ఇరువయ్యవ శతాబ్దంలో కొడుకు కోపం వస్తే ఏమంటాడో అదే అన్నాడు అతడు.

రాముడు ఒక్కటే మాట అన్నాడు. 'లక్ష్మణా! ఏదెలా ఉన్నా, నేను నాన్న గారు ఇచ్చిన మాటకు కట్టుబడదలచుకున్నాను. అరణ్యాలకు వెళ్ళదలచుకున్నాను. నారబట్టలు కట్టుకుంటున్నాను.'

అలా నిలబడిపోయాడు లక్ష్మణుడు 'నేనూ నారబట్టలు కట్టుకుంటాను' అన్నాడు, సీతాదేవి వచ్చి నేనూ కట్టుకుంటానన్నది. ఇక ఎక్కువ కాలం ఇక్కడే ఉంటే అందరూ నారబట్టలు కట్టుకునేటట్లు ఉన్నారని రాముడు కదిలిపోసాగాడు.

తల్లికి నమస్కరిస్తే, తానుకూడా నారబట్టలు కట్టుకుంటానన్నది ఆమె అప్పుడు రాముడు అన్నాడు. అమ్మా కొడుకు ఎంతటి ప్రయోజకుడైనా స్త్రీమూర్తి భర్తతో ఉండడమే భావ్యం. పైగా ఇది ఎలాంటి సమయం? ఇంతకాలం ఎవరిచుట్టూ తిరిగాడో అక్కడ ఎదురుదెబ్బ తగిలి ఆయన మూర్ఛపోతూ ఉంటే, ఓదార్చే దిక్కు లేక అల్లాడుతూ ఉంటే నీవు నాతో వస్తావా? తండ్రి గాయం మాన్పవద్దా? నేను ఎలాగూ పితృసేవ చేయలేను. తండ్రిని సేదతీర్చే బాధ్యత నీపై ఉన్నది.

రామాయణం ఇక్కడ ఏమి చూపుతున్నది? ఇన్ని పరిస్థితులు ముందుకు వస్తున్నప్పటికీ రాముడు ఏమంటున్నాడు? దశరథుడిని అర్థం చేసుకోండి. కైకేయిని అర్థం చేసుకోండి. వాళ్లను సేదదీర్చండి. తన కొడుకు రాజు కావాలని కోరుకోవడం ఆమె తప్పుకాదు. ఎవరి కొడుకు గురించి వారు అలా కోరుకోవడం సహజం. నాన్న గారు అలా బాధపడడం సహజం. పెద్ద కొడుకుగా వారికి సేవచేసుకునే భాగ్యానికి నోచుకోనందుకు నాకు బాధగా ఉంది. అమ్మా! నీవైనా ఆ గాయాన్ని మాన్పు. అంత కన్న నేనేమీ చెప్పలేనమ్మా.

ఆ మాటలకు కౌసల్య కరగిపోయింది. కాని, ఆవిడ బాధ ఏమంటే 'నేను తండ్రిని సేద దీర్చుతాను. బాగానే ఉంది. నీవు వెళ్ళిపోతావు. భరతుడు రాజవుతాడు. కైకేయి రాజమాత అవుతుంది. రాజమాత కాబోయి పడిపోయిన దానిని నేను. పట్టమహిషినై భర్త ప్రేమకు నోచుకోలేదు. పెద్ద కొడుకును కని రాజమాత అయ్యే అదృష్టానికి నోచుకోనివానిని నేను. భర్త ఉండీ లేక, రాజమాత కాలేక, కొడుకు వెళ్ళిపోతే ఆ కైకేయి చూసే చూపులు నేనెలా తట్టుకోను తండ్రీ !

ఊగిపోతోంది ఆవిడ. అలాంటి ఆవిడను చూచి రాముడు - 'అమ్మా ! నువ్వు నీ బాధ గురించి ఆలోచిస్తున్నావు గాని, తండ్రి పడే క్షోభను గురించి ఆలోచించు. ఆయనను బ్రతికించుకునే ప్రయత్నం చెయ్యి. ఆయనకు ఇప్పుడు ఊహించని దెబ్బ తగిలింది. ఆయన కోలుకోవటం చాలా కష్టం. ఆయనను బ్రతికించుకోండి.'

రాముడు సుమిత్ర దగ్గరకు వచ్చాడు. ఈ తల్లి ఏమి చెపుతోంది. ఒక తల్లి తన కొడుకు రాజు కావాలన్న కోరికతో ఇంతటి కథ సృష్టించింది. ఒక తల్లి తన కొడుకు రాజు కాలేదే అన్న బాధతో తానుకూడా అరణ్యాలకు వస్తానంటోంది. మరి ఈ తల్లి ఏమి చెప్పింది ? భగవంతుడు నాకు ఇద్దరు బిడ్డలను ఇచ్చాడు. మీ ఇద్దరికీ వాళ్లను ఇస్తాను. అని చెప్పుకొంది. లక్ష్మణుడిని రాముడికి అప్పజెప్పింది. శత్రుఘ్నుడిని భరతునికి అప్పజెప్పింది. సెభాష్ ! ఇటువంటి కేరక్టర్ సృష్టిలో మరెక్కడా కనపడదు, నభూతో న భవిష్యతి. నా కొడుకు రాజు కాలేదే అని బాధ పడలేదు. 'నా కొడుకు రాజు కావాలని ఆశ పడలేదు. రాముడితో నా కొడుకు తిరుగుతుంటే, భరతుడితో నా కొడుకు తిరుగుతుంటే - నాకంతకన్నా ఏంకావాలి ? అదే నాకు ముచ్చట అనుకున్నది. మిగతా ఇద్దరి మధ్య నలిగిపోకుండా వెలిగిపోయిన సుమిత్ర విశిష్టత చూడండి. ఆవిడ అంటుంది - 'లక్ష్మణా, నిన్ను ఇతడి చేతిలో పెడుతున్నాను. అతడే నీకు తండ్రి. ఈమె వదిన కాదు తల్లి. ఈయన ఉంటున్న అరణ్యమే నీకు అయోధ్య. వారిని సేవిస్తూ నీ జీవితం ధన్యం చేసుకో.' అలా అంటూ అక్షింతలువేసి పంపిన సాధ్వీమతల్లి సుమిత్ర.

ఇక ఆ తండ్రీ కొడుకుల బంధం చూడండి.

ఆ స్థానంలో ఇంకెవరైనా ఉంటే — 'తండ్రీ, పెద్ద కొడుకును అయినందుకు ఇదా నీవు నాకిచ్చేది' అని తిట్టుకుంటాడు. ఇవాళ మనమంటాం. ఏమండీ మీ నాన్నగారి సంగతి ఏమిటండీ - అంటే ఆయన నాకేమిచ్చాడని అడుగుతాం. ఈ శరీరం ఇచ్చాడు చాలదా ?

అలా నడచి వెళ్ళిపోయిన రామునిలో తాను తండ్రికి సేవ చేయలేకపోయాననే బాధ గూడు కట్టుకుని, సుళ్లువేసి, ఎక్కడిదాక వెళ్ళిందంటే అరణ్యవాసంలో సీతాదేవిని రావణుడు ఎత్తుకు పోతున్నప్పుడు, జటాయువు అడ్డుపడి, రావణునితో పోరాడి రెక్కలుతెగిపడి ఉన్నప్పుడు, అటువైపు వస్తున్న రాముడితో జరిగిన కథ ఇది అని చెప్పి ప్రాణాలు విడిచినప్పుడు- తండ్రి స్నేహితుడు జటాయువు, తండ్రి తర్వాత తండ్రి అంతటివాడు కనుక అతడికి దహన సంస్కారాదికాలు నిర్వహిస్తూ రాముడంటాడు నా తండ్రికి 'సేవ చేయలేకపోయాననే బాధ కొంత ఇలా తీరిందని'. మీరు ప్రేమ అనండి. సెంటిమెంట్ అనండి. మమకారం అనండి. అది లేని జన్మ బండ రాయివంటి జన్మ.

ఆ తండ్రి ఎలాంటివాడు? రావణాసురుడిని చంపినప్పుడు దేవతలతో దిగి వచ్చి అభినందించాడు ఆ తండ్రి. 'రామా నీవు నాకు ఎంతటి అదృష్టాన్ని కలిగించావు రాగ ద్వేషాలమధ్య పుట్టి, ఆ రాగ ద్వేషాలతో లోకకళ్యాణాన్ని సృష్టించిన ఓ ధర్మమూర్తీ, నీకు నమస్కారం.'

ఆ కైక వరాలు కోరకపోతే రాముడు అరణ్యాలకు వెళ్లడు. సీతాపహరణం జరుగదు. రావణవధ లేదు. లోకకళ్యాణం లేదు. ధర్మ సంస్థాపన లేదు. కనుక మానవులలోని రాగద్వేషాలను కూడా జగత్ కళ్యాణంవైపు మళ్లించే అంతర్యామి ఒకడు ఉన్నాడు. ఇప్పుడు కైకది తప్పా? అంటే తప్పు: కాదా? అంటే కాదు.

కనుకనే శ్రీరామచంద్రుడు ఎన్నడూ తన తల్లిని తప్పు పట్టలేదు. శ్రద్ధా భక్తులతో కొలిచాడు. ఆనాడు విశ్వామిత్రునికి ఇచ్చిన మాటకు కట్టుబడి యాగరక్షణ చేశాడు. ఈనాడు తండ్రి మాటకు కట్టుబడి అరణ్యవాసం చేశాడు. దేవతలకు ఇచ్చిన మాటకు కట్టుబడి ధర్మసంస్థాపన చేశాడు.

ఈ కథలోనే భరతుడు ఉన్నాడు. 'అమ్మా, నువ్వు అడిగినంత మాత్రాన నేను రాజ్యాన్ని పాలిస్తానని అనుకున్నావా? నా మనసు తెలియని దానివి నీవు నా తల్లివి ఎలా అయ్యావు? నువ్వు అడిగావు బాగానే ఉంది. నీ కొడుకు హృదయంలో రాముడికి ఉన్న స్థానమేమిటో నీకు తెలియదా? ఎంత బేలవైనావు? ఎంత దుష్టురాలివి అయినావు? తల్లిగా ఉండడానికి నీకు అర్హత ఎక్కడ ఉంది'? అని అడిగాడు అతడు.

కాగా రాముడు చివరికి తమ్ములు అందరినీ దగ్గరకు చేర్చుకుని ఏమన్నాడు? తల్లి దండ్రులను ఎదిరించకండి. మన క్షేమతో వారిని చక్కగా మలచుకుని వెళ్లే

మార్గం ఒకటి ఉన్నది. మనం ఘర్షణ పడనక్కరలేదు. రాజీ పడనక్కరలేదు.వారిని ప్రేమించడం మాననక్కర లేదు. అలాగని ఆ అధర్మానికి మనం కట్టుబడ నక్కర లేదు. ఇన్ని కథల మధ్యలో ఒక ఒడుపు ఉన్నది.

ఒకవేళ మీరిలా నడవలేక మరోలానడచినవేళ రామాయణమే మీకు ఆదర్శం. సృష్టికథమాత్రం జగత్కళ్యాణం వైపు నడుస్తోంది. మనం నడవలేకపోతే మనమే క్షోభ అనుభవిస్తాం. ఒకవేళ నీకు బ్రతకడం చేతకాక ఈర్ష్యాసూయలు నిన్ను పడ గొట్టినా దాన్ని కూడ మా జగత్కళ్యాణ కార్యక్రమంలోకే స్వీకరిస్తాం. మనిషీ ! బ్రతకడం చేతనైతే ధర్మం ప్రక్కన ఉండి మాకు సహకరిస్తావు. ఒకవేళ నీకు బ్రతకడం చేతకాక, ఈర్ష్యాసూయలు నిన్ను పడగొట్టినా దాన్నికూడ మా జగత్కళ్యాణ కార్యక్రమంలోకే స్వీకరిస్తాం. మొత్తం మీద నాటకంలో ఏదో ఒక పాత్రను పోషించి తీరుతావు. నాటకం మాత్రం మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని.

ఈ ధైర్యాన్ని మనకు కలిగిస్తూ నడిపించే అంతర్యామికి నమస్కరిస్తూ, ఆ శ్రీరామచంద్రునికి ఏటికోళ్ళు అర్పించుకుందాం. క్షోభ అనుభవించిన తమ్ముళ్లను చూపుడు వ్రేలితో ఎలా ధర్మం వైపుకు నడిపించాడో, అలా మన జాతిని నడిపించ మని కోరుకుందాం. మన గృహాలలో మళ్ళీ తల్లిదండ్రుల బిడ్డల అనుబంధం మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లేటట్లు చేయమని వేడుకుందాం. ఏమిచ్చారు, ఏమి చేశారు అని చూడకుండా తల్లిదండ్రులను సేవించుకునే ధర్మానికి మనం నోచు కుందాం.

మరొక్కమాట. గృహస్థ జీవితంద్వారా మానవ జీవితానికి పరిపూర్ణత ఎలా చేకూరుతుందో తెలియజెప్పడానికి రామాయణం ఉన్నది. గృహస్థులకు ఇది కల్ప వృక్షం. గృహస్థ జీవితానికి గైడ్‌లైన్స్ ఇందులో లభిస్తాయి కనుక, ఇది నిత్య పారాయణ గ్రంథం. దీన్ని యాంత్రికంగా చదవవద్దు. సుందరకాండ ఇన్ని రోజు లలో అయిపోవాలని మాత్రం చదవవద్దు.

చక్కగా వాళ్లదగ్గర నిలబడి చూస్తేనా కనిపిస్తుంది. కైక కోరికా సహజమే కౌసల్యా బాధా సహజమే. సుమిత్ర భావం మాత్రం లోకోత్తరం. ఆ దశరథుడు నలిగి పోవడం లోకసహజం. లక్ష్మణుడికి కోపం రావడం లోకసహజమే. కాని, భరతుడు నిలబడడం మాత్రం లోకోత్తరం.

ఇందరి మధ్య నిలబడ్డాడు రాముడు. అతడికీ మమకారం ఉన్నది. కోపం ఉన్నది. ఆవేశం ఉన్నది. అయితే అవన్నీ ధర్మాన్ని దాటలేదు. అన్నిటి మధ్య ధర్మ సూత్రాన్ని పట్టుకుని, లోకరీతుల మధ్య దాన్ని తెగకుండా తీసుకువెళ్ళిన ధర్మమూర్తికి నా నమస్కారం. జీవిత సన్నివేశాలను ధర్మాన్ని అతిక్రమించకుండా నిర్వహించడమే తపస్సు.

ఆ రాము డేమంటున్నాడు? మానవుడా, గృహస్థ జీవితంలో ధర్మాన్ని నిలబెట్టుకుంటే అది గృహస్థ ఆశ్రమం అవుతుంది. జీవన్ముక్త స్థితి నీకు లభిస్తుంది. నీవు ధర్మవిదుడవు అవుతావు. కనుక, నీ కొరకు నేనీ భూమిమీదకు దిగివచ్చి, ఇలా జీవించి, నేనీ సూత్రం అందిస్తున్నాను.

అలా చెపుతూ- తల్లి దండ్రులకు బిడ్డయై, అన్నదమ్ములకు అన్నయై సాగి వెళుతున్న ధర్మమూర్తికి నమస్కరిస్తున్నాను. ఆ తల్లులు తరించారు. ఆ తండ్రి తరించాడు. ఆ తమ్ములు ధన్యులైనారు. ఆ కథ ఈనాటికీ ప్రశస్తమై నిలచింది. ఆ మమకారాల ఘర్షణల మధ్యలో నుండి ఆ తల్లులను ఉద్ధరించుకున్నాడు. ఆ తండ్రిని ఉద్ధరించాడు. అందరినీ తనలోనికి స్వీకరించాడు. అలాంటి దివ్యస్థితికి మనము నోచుకొందుము గాక.



# అన్నదమ్ముల అనుబంధం

రామాయణమంతా కుటుంబగతమే. ప్రధానంగా మూడు కుటుంబాలు ఇందులో ఉన్నాయి. దశరథుని కుటుంబం, వాలి కుటుంబం, రావణుని కుటుంబం, దశరథుని బిడ్డలు, వాలి సుగ్రీవులు, రావణ కుంభకర్ణ విభీషణులు - ఈ అన్నదమ్ముల మధ్య నడిచిన వైవిధ్యం రామాయణం.

మీరు రామలక్ష్మణులలా ఉంటారా? వాలి సుగ్రీవులలా ఉంటారా? తోడు నీడగా ఉంటారా, పీడ పీడగా ఉంటారా?

వాలి సుగ్రీవుడిని నమ్మడు. సుగ్రీవుడు వాలిని నమ్మడు. రాత్రిపూట సింహాసనంలోనే నిద్రపోతున్నాడు సుగ్రీవుడు. ఇంట్లోకి వెళ్ళి పడుకుంటే ఈ ఖాళీ సింహాసనంలో వాలి వచ్చి కూర్చుంటాడని భయం.

ఒకసారి వాలి యుద్ధానికి వెళితే ఇంకా మా అన్నయ్య రాలేదే అని సుగ్రీవుడు చూచాడు. లోపల మాత్రం రాకూడదు అని వుంది. బయటికి రాలేదేమిటి, అంటున్నాడు. వాడు రాకుండా హతమైపోతే తాను రాజు కావచ్చని అతడి మనసులో ఉంది. కనుక పదండి చూద్దాం అన్నాడు. గుహ లోపల యుద్ధం జరుగుతున్నది. గుహలోనుండి రక్తం వస్తోంది. అన్నయ్యా పోయావా? అన్నాడు సుగ్రీవుడు. ఒక పెద్ద రాయి తెచ్చి ఆ గుహ ముఖానికి అడ్డుపెట్టాడు. అన్న బ్రతికి ఉంటే బయటకు రాకుండా, తిరిగివచ్చి పట్టాభిషేకం చేసుకున్నాడు. పార్టీ ఇద్దామని అనుకున్నాడో లేదో - వాలి తిరిగివచ్చి ఏరా! అన్నాడు. వాలి తరిమి, తరిమి కొడితే ఋష్యమూక పర్వతం మీద దాక్కున్నాడు. అది 'అన్న' రాని ప్రదేశం కనుక. దీనికి ప్రతిగా వాలి సుగ్రీవుని భార్య రుమను తీసుకెళ్ళిపోయాడు.

రాముడు దగ్గరయితే సుగ్రీవుడు తనకు అన్యాయం జరిగిందని చెప్పుకున్నాడు 'నీ భార్యను అతడు తీసుకువెళ్లటం దోషం. నా భార్యను తీసుకొనివెళ్లినవాడిని ఏం చేస్తానో ఇతడినీ అదే చేస్తాను. వాలిని నేను సంహరిస్తాను, ఈ నా రాజ్యంలో అధర్మం జరగకూడదు కనుక, - అన్నాడు రాముడు.

అని రాముడు లక్ష్మణునివైపు చూశాడు. 'మనమూ అన్నదమ్ములమే. ఆ తమ్ముడు వచ్చి ఏమి కోరుతున్నాడు? నా అన్నను చంపిపెట్టు అని. ఎంత దారుణం!

మళ్లీ ఒక రాత్రివేళ వచ్చాడు. సుగ్రీవుడు. రాముడు వాలిని చంపలేడేమోనని చూట్ వాడికి. ఇక్కడ వరుసగా ఏడు మద్దిచెట్లున్నాయి. వాటిని ఒక్కసారే కొడితే నాకొక్కంచెం ధైర్యం వస్తుంది మీరు వాలిని చంపగలరని - అన్నాడు. అలాగే కొట్టాడు పాపం ఆయన. అతనికి కొంత నమ్మకం కలిగింది. వీళ్లూ అన్నదమ్ములే.

సరే ఆయన కొట్టాడు. నా భార్యను తీసుకెళ్లాడని ఏడ్చిన సుగ్రీవుడు, వాలి చనిపోయిన తర్వాత అతడి భార్య తారను తెచ్చుకొన్నాడు. ఏమి అన్నదమ్ముల అను బంధం!

కథ ఇంకా పైకి సాగింది. రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు - వీళ్లు అన్నదమ్ములే. సీతాదేవిని చెరబట్టి తీసుకువస్తే చూచి, విభీషణుడు అన్నాడు - ఇది అన్యాయం అని.

రావణుడేమన్నాడు? 'ఒరే చేతకాని సన్నాసి! నీకు ధైర్యం లేదు. సాహసం లేదు. నీవు పెతక వెధవ్వు. నీవు చేయలేవు, నన్ను చేయనీయవు. చేసే దమ్ము నీకు లేదు. నాకున్నది నీవు సహించలేవు'.

విభీషణుడు : నేనిక్కడ చూస్తూ ఉండలేను.

రావణుడు : వెళ్లి ఏట్లో దిగు.

ఆ తర్వాత యుద్ధం వచ్చింది. అందరూ పడిపోతున్నారు. రావణుడికి కుంభకర్ణుడు గుర్తుకు వచ్చాడు. అతడిని లేపండి అన్నాడు. లేపి తీసుకువస్తే ఆ తమ్ముడు అన్నాడు. 'అన్నా! నీకు బుద్ధిలేదు. స్త్రీలోలత్వం అనే వీక్ పాయింట్ ఒకటి నీలో ఉంది. నీ పది తలలలో ఒక్క తలా పనిచేయలేదా? చేయకూడని పని చేశావు. తీసుకురాకూడని వ్యక్తిని తీసుకువచ్చావు. ఇప్పుడు బాధపడి ఏమి లాభం? నీవు ధైర్యవంతుడవైతే ఆ రాముడిని సంహరించి ఆమెను తీసుకురాలేకపోయావా?'

ఆ మాటకు రావణునకు కొంచెం భయం వేసింది. 'రాముడంటే భయం లేక పోతే పొంగతనంగా ఎందుకు తెచ్చాను' ? అనుకున్నాడు.

కుంభకర్ణుడు ఇంకా అన్నాడు : 'ఒక తల్లి కడుపున పుట్టాము. ఉన్నా కలిసి ఉంటాం. పోయినా కలిసి పోతాం. తప్పో, ఒప్పో నీవు చేశావు. కట్టుబడుతున్నాను. ఉన్న ఒక్క తమ్ముడూ ఏదు మాటాడు. అందుకని నేను నీ కోసం చచ్చిపోతాలే పోనీ. ఈ నిద్ర పోయేది పెద్ద నిద్ర పోతాను'.

పీరూ అన్నదమ్ములే.

తల్లి మరణశయ్యపై ఉన్నది. ఆ వచ్చినవాడు పెద్దకొడుకు. 'నువ్వు ఏమి స్తావు ? నాకు రెండెకరాలు ప్రత్యేకంగా వ్రాస్తే తలకొరివి పెడతాను. లేకపోతే లేదు, అన్నాడు. ఆమె రెండెకరాలు వ్రాసింది. అంతే. వాడు వెంటనే బజారుకు వెళ్ళి పోయాడు రెండెకరాలకూ బేరం పెట్టాడు. ఈలోపల అతని తమ్ముడు వచ్చాడు. ఆమెను ఎవరి భాగంలోనూ ఉంచకూడదు. మధ్య వరండాలో ఉంచండి' అని పట్టుబట్టాడు. ఎవరి భాగంలో అయినా పోతే ఆ సోదరుడు ఆ అవకాశం వినియోగించుకోవచ్చని అతడి బాధ.

ఇది నా కళ్లతో చూచిన సన్నివేశం.

ఇలా ఆస్తిపాస్తుల మధ్య ఆత్మీయతలు ఆహుతై పోయిన వేళ - అన్నా అన్న పిలుపులో ఆత్మీయత ఎక్కడున్నది ? ఆస్తుల కోసం కోర్టులకు వెళ్లేవాళ్లే ఎక్కువ మంది ఉంటున్నారు. కలిసి ఉన్న వాళ్లను వేళ్లమీద లెక్కపెట్టి, వాళ్లకు నమస్కరించవలసి ఉంది.

ఇక రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అన్నదమ్ముల అన్యోన్యతకు భాష్యం చెప్పినవారు. 'మా తమ్ముడి టెంపర్‌మెంట్ వేరండీ. అందుకని వాడిని వేరే పెట్టే శాము' అని మనం అంటూ ఉంటాం. అలా అనుకుంటే రాముడు లక్ష్మణుడిని చూచి ఏమనుకోవాలి ? రాముడు బ్యాలెన్స్‌డ్‌గా సత్త్వగుణ సంపన్నుడుగా ఉంటాడు. లక్ష్మణుడు రజోగుణ సంపన్నుడు. ఆదిశేషునివలే బుసలుకొట్టే స్వభావం కలవాడు. వీళ్లిద్దరికీ ఎలా నప్పుతుంది ? మళ్లీ భరతుడిది మరొక టెంపర్‌మెంట్. ఆ వెనుక శత్రుఘ్నుడు వేరే. ఈ నలుగురికీ ఎలా నప్పుతుంది ? కాని నప్పింది.

ఎలా నప్పింది ?

అడవికి వెళ్లడానికి నిశ్చయించుకున్న రామునితో లక్ష్మణుడు - ముసలివాడు, కామాంధుడు అన్నమాట పట్టించుకోనవసరం లేదన్నాడు. 'ఆ తండ్రి కామాతురుడై ఆజ్ఞాపించినా సరే నేను ఆయన ఆజ్ఞకు బద్ధుడనై ఉంటాను. ఈ రాజ్యం ఆయనిది. ఏ రూపేణా ఎవరి కిచ్చినా హక్కు ఆయనది. నేను బద్ధుడను. తే నారచీరలు' - అన్నాడు రాముడు.

లక్ష్మణుడు వెంటనే 'నేనూ వస్తున్నాను' - అన్నాడు.

లక్ష్మణుడు ఆవేశపరుడు. తండ్రిని తిట్టాలని అతనికి లేదు. అన్నయ్యకు అన్యాయం జరగటం సహించలేకపోయాడు.

కానీ అన్నయ్య అలా నారచీర కట్టాక, తమ్ముడిగా తానుకూడ నారచీర కట్టు కుని వచ్చేశాడు. నీవు ఎక్కడ ఉంటే నేనూ అక్కడే ఉంటానన్నాడు.

ఎంతమంది తమ్ముళ్లు ఉంటారు ఇలా. కష్టం వస్తే పలకరించటానికి వెళ్ళ టానికే అన్నలం, తమ్ములం. దగ్గరవారం కదండీ, వెళ్లకపోతే బాగుండదు అని చెప్పుకునే స్థితిలో ఉన్న వాళ్లం. వెళ్లాలని పరవశించి వెళ్లే ఆ రోజులు ఎక్కడకు వెళ్లాయి ? మన హృదయాలు ఎక్కడికి పోయాయి ? మన ఆత్మీయతలు ఏమైపో యాయి ? ఇవాళ ఎలా బ్రతుకుతున్నాం ? అన్నదమ్ముల కొడుకులను గుర్తుపట్టలేరు. ఫోటో ఆల్బమ్‌లలో చూసుకోవాలి. అదికూడా సఖ్యత ఉంటే.

అలా 'సీతతో నేను ఉంటాను' అని బయలుదేరి 14 ఏండ్లు నిద్రాహారాలకో నిమిత్తం లేకుండా అన్నకు నీడగా నిలచిన తమ్ముడు అతడు అన్నతో శ్రుతి కల పడం తప్ప, అన్న ఆజ్ఞను నిర్వహించడం తప్ప - తనకంటూ ఒక జీవితం ఉన్న దని అతనికి ఎన్నడూ అనిపించలేదు. అన్నయే తాను, తానే అన్న అన్న అద్వైత స్థితికి, అన్యోన్యతకు భాష్యం మరెక్కడ ఉన్నది ?

ఈ ప్రపంచంలో ఒక మనిషి ఉన్నట్లు మరో మనిషి ఉండడు. మనుషులలో వైవిధ్యం ఉండి తీరుతుంది. ఆ వైవిధ్యంలో కలసి ఉండడం చేతకావాలి. మనిషికి మనిషి పరస్పరం పరిపోషకంగా ఉండాలి. నావలె నీవు ఉండటం కాదు. మనం ఇద్ద రం కలిస్తే ఒక పరిపూర్ణత వస్తుంది. ఈ సత్యం తెలియక - నా వలె ఆలోచించరు, నేను చెప్పినట్లు వినరు అని గింజుకుంటూ కొన్ని వేల లక్షల జీవితాలు వెళ్లిపోతూ ఉంటాయి.

కనుక - విభిన్న మనస్తత్వాలను ఒకచోట చేర్చి, ఒక శ్రుతిని కూర్చి, పరస్పర పరిపోషకంగా పరిపూర్ణమైన ఒక రూపాన్ని మనం అందజేయాలి. అదే గృహస్థ ధర్మంలో మనం సాధించవలసి ఉంది. ఆ శ్రుతిని కుదిర్చే నైపుణ్యం మనకు చేతకావాలి. బ్యాండ్ మేళంలో వివిధ వాద్యముల మధ్య ఎలా శ్రుతి కుదురుతుందో, అందరూ కలసి గతి తప్పకుండా ఎలా పాట పాడుతున్నారో అలా వివిధ మనస్తత్వములు కలసిన మనము ఒక కుటుంబసభ్యులమై లోకహితమును గానం చేయలేమా ?

అవ్యాజమైన ప్రేమ ద్వారానే ఇది సాధ్యపడుతుంది. పట్టు చీర తీసుకురాకపోతే పండుగకు పిండివంట చేయలేదనుకోండి. ప్రేమ ఏముంది ? కొడుకు కోడలి మాట వినగానే అతడిని ద్వేషించామనుకోండి. అది ప్రేమ ఏమిటి? మీ ప్రవర్తనలతో నిమిత్తం లేకుండా మీ శ్రేయస్సు కోరగలిగితే - దాన్ని ప్రేమ అంటారు. శ్రీరామచంద్రునిది అలాంటి అవ్యాజమైన ప్రేమ.

అలా అన్న వెంట అరణ్యానికి వెళ్లిన లక్ష్మణుడు చెట్టుమీదనుంచి భరతుడు వస్తున్నట్టు చూశాడు. 'మళ్లీ ప్రమాదం వస్తోంది. ఆ తల్లికొడుకు వస్తున్నాడు' - అన్నాడు. ఫర్వాలేదులే - అన్నాడు రాముడు.

భరతుడు వచ్చేశాడు. చతురంగ బలాలతో, కుల గురువుతో, తల్లులతో, సమస్త అయోధ్యతో వచ్చి కాళ్ల మీద పడుతున్నాడు. 'నన్ను క్షమించానంటే లేస్తాను, నీవు అయోధ్య వస్తానంటే లేస్తాను. ఆ తల్లి కోరడమూ బాగుంది. నీవు రావడమూ బాగుంది. ఒక్కమాట ఆలోచించావా ? ఈ భరతుడు ఆ రాజ్యానికి అధికారం వహిస్తాడని ఎలా అనుకున్నావు నీవు ? నీ పాదాల దగ్గర కూర్చుని సేవ చేసుకోవడంలో ఉన్న తృప్తి నాకు సింహాసనంలో ఉంటుందా అన్నయ్యా ? నేను ఒక్కటి అడుగుతాను. అడుగో వశిష్ఠుడు. అదుగో వామనాది ఋషులు. అదుగో తల్లులు ముగ్గురూ. ఇంక అయోధ్యలో ఎవరూ మిగలలేదు. వాళ్లను అడుగు. నీవు వస్తే వెళతాము. నీవు రాకపోతే ఈ అరణ్యాన్నే అయోధ్యగా మార్చేసి ఇక్కడే ఉంటాము' - అన్నాడు.

'నీవు ఆవేశపడుతున్నావు తమ్ముడూ - పధ్నాలుగు ఏళ్ల ఇట్టే గడిచిపోతాయి. ఈ అన్నయ్య తప్పకుండా వచ్చి మళ్లీ స్వీకరిస్తాడు. నా తమ్ముడు భరతుడు సమర్థుడు. అతడీ రాజ్యాన్ని పాలించగలడు అన్న విశ్వాసంతోనే నేను అరణ్యవాసానికి వచ్చాను నీవు ఆవేశపడి, ప్రజలను ఆవేశపరచి ఈ విధంగా ఊరేగింపులూ, ప్రదర్శనలూ

చేయకూడదు. కనుక తమ్ముడూ, నీవు వెళ్లి రాజ్యాన్ని పరిపాలించు. పాలకుడికి కావలసింది ఆవేశం కాదు. ఆలోచన. ప్రజల యెడల ఆరాధనా భావం.'

'అది కలలో వార్త, నీవు వస్తే వెళతాను. లేకపోతే వెళ్లను.'

'తండ్రి ఒక మాట ఇచ్చాడు. ఆ మాటకు కట్టుబడ్డాను. మాట తండ్రిదే. రాజ్యమూ తండ్రిదే. మాట మనకు ఇబ్బందిగా ఉంది కనుక మాట తీసేద్దాం రాజ్యం మనకు బాగుంటుంది కనుక రాజ్యాన్ని స్వీకరిద్దాం అంటే - మా నాన్న చేసిన అప్పు మాత్రం అక్కరలేదు. ఆస్తి మాత్రం స్వీకరిస్తాం అన్న అన్నదమ్ములలా ఉంటుంది మన తర్వాత వాళ్లు కూడా ధర్మాన్ని పాటించడానికి కావలసిన ఏర్పాటు మనం చేయాలంటే తాత్కాలికమైన ఆవేశాలకు తెరపడాలి. ఇవి వ్యక్తిగతమైనవి కావు. సామాజిక బాధ్యతలు. నీవైపు, నా వైపు ఇప్పటి ప్రజలు, రాబోయే తరాలవాళ్లు చూస్తుంటారు. కనుక మనం మాటకు కట్టుబడదాం. ధర్మంమీద నిలబడదాం. శాశ్వతమైన ధర్మంవైపు చూసి నేను చెపుతున్నాను. నేను రాకూడదు. నీవు అడగకూడదు. నీవు పరిపాలించాలి. ఇది నా నిర్ణయం.'

'అయితే ఒకలా రాజీకి వద్దాం. నీవు రావు, నేను పరిపాలించను. నీ పాదుకలు నా కివ్వు. వాటిని సింహాసనంమీద పెడతాను. నేను నీ ప్రతినిధిగా ప్రక్కన కూర్చుంటాను. పరిపాలన నీవు చేస్తున్నట్లు అవుతుంది.'

భరతుడు పాదుకలే ఎందుకు అడగాలి ? ఉంగరం అడగవచ్చుకదా. చరణములు అంటే నడచేవి పాదుకలు చరణములకు వేసుకొనేవి. వెళ్లే మార్గాన్ని సూచించేవి.

భరతుడు ఇంకా అంటున్నాడు - 'అన్నా, నీవు నడచే మార్గం వెంట ఈ రాజ్యపాలన సాగనీ. నీ కాలికి అలవాటుపడిన ఈ పాదుక ధర్మాన్ని పాదుకొలపనీ. నన్ను నడిపించనీ. ఆ పాదుకకు నమస్కరిస్తే ఆ పథం నాకు తడుతుంది. పొడ కడుతుంది. నీ పాదుకలు నాకు ఇవ్వు.' అని అడిగి తీసుకుంటూ అన్నాడు.

'అన్నయ్యా, ఆ తల్లికి కొడుకును కదా నేను మా అమ్మ నీకు రాజ్యం లేకుండా చేసింది. అరణ్యమార్గంలో పాదుకలు లేకుండా చేసినవాడిని నేను.'

అని భరతుడు ఏడుస్తూ ఉంటే, రాముడు అలా లక్ష్మణునివైపు చూశాడు. లక్ష్మణుడు తలకాయ వంచేసుకుని ఏడ్చేస్తున్నాడు. లక్ష్మణుని కన్నీటిబొట్లు భరతుడిని అభిషేకం చేస్తున్నాయి.

'అన్నా, నమస్కారం. భరతుడా, భక్తి భరతుడా, జోహారు. నీ వంటి తమ్ముడులేడు. నాకైనా ఇంకా కొంత స్వార్థం ఉంది. నిరంతరం రాముని వెంట ఉండే అవకాశం ఉంది నాకు. పాదుకను పెట్టుకుని పద్నాలుగు సంవత్సరాలు భక్తితో కట్టుబడి బ్రతికేందుకు దీక్ష స్వీకరించిన నీకు జోహారు. నీ తల్లినిబట్టి నిన్ను అపార్థం చేసుకున్నందుకు నన్ను క్షమిస్తావు కదూ.'

అని లక్ష్మణుడు కన్నీటితో అభిషేకం చేస్తుంటే ఆ భరతుడు ఇలా చూస్తున్నాడు. 'అన్నయ్యను చూసుకునే అదృష్టం నాకు ఎలాగూ లేదు. లక్ష్మణా, నీవు కంటికి రెప్పలా కాపాడుకుంటావుగా. నా బదులుగా కూడా నీవు ఉండు. నీ కంటితో అన్నను చూసుకునే అదృష్టాన్ని నాకు ఇవ్వు.' అని లక్ష్మణుడిని అడుగుతున్నట్లుగా చూస్తున్నాడు.

ఇలాంటి అన్నదమ్ములు ఈ భూమి మీద ఒకనాడు బ్రతికారు. ఇలాంటి అనుబంధం ఒకనాడు నడిచింది. 'ఎంతటి దివ్యానుబంధం ఇది.'

ఆ తర్వాత యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛపోయిన వేళ అతడు పోయాడని చెప్పగా - ఆ బాధను తట్టుకోలేక రాముడు 'తండ్రిపోతే ఇన్నాళ్లు, తల్లిపోతే ఇన్నాళ్లు, అన్నదమ్ములుపోతే ఇన్నాళ్ల దుఃఖం ఉంటుందంటారు. కాని బిడ్డపోయిన దుఃఖం ఆజన్మాంతం ఉంటుందంటారు. నాన్నా అది కెలికివేస్తుంది. కలచివేస్తుంది. కాల్చి వేస్తుంది. నీవేలేని ఈ జన్మ నేను ఊహించలేను' తండ్రీఅని మీదపడి మూర్ఛ పోయాడు. అంటే అర్థం ఏమిటి ? 'నేను నిన్ను ఎప్పుడూ తమ్మునిలా చూడలేదు. నా బిడ్డగా చూసుకున్నాను.' అన్నమాట ఆయన నోటివెంట వచ్చేసింది.

అందుకే భారతీయ సంప్రదాయంలో తండ్రి తర్వాత పెద్ద అన్న తన తమ్ముళ్లను బిడ్డలుగా చూచే సదాచారం ఏర్పడింది. దానికి రాముడే ప్రాతిపదిక, తార్కాణము.



# భార్యాభర్తల అనుబంధం

మన పెద్దలు భార్యను ధర్మపత్ని, సహధర్మచారిణి అన్నారు. సహకామచారిణి అనలేదు. దాంపత్యం పరమ పవిత్రమైనది. దంపతులు ఎదగదలుచుకుంటే అది దంపతుల వరకు ఎదగవచ్చు. అద్వైత సిద్ధివరకు ఎదగవచ్చు. అద్వైతస్థితికి తొలి సోపానం దాంపత్యం. భార్య భర్తను ఆరాధించాలి. భర్త భార్యను ఆరాధించాలి. భార్య భర్తకొరకు బ్రతుకుతుంది. భర్త భార్య కొరకు బ్రతుకుతాడు. పాశ్చాత్య ప్రభావంలోపడి, 'మీ డబ్బు మీ అకౌంట్‌లో వేసుకోండి.నా డబ్బు నా అకౌంట్‌లో వేసుకుంటాను' అంటే అది రైలు-బోగీ దాంపత్యం అవుతుంది.

కనుక త్యాగం నేర్పినా, విరాగం నేర్పినా దాంపత్యం మాత్రమే. మనం అనుకుంటాం — దాంపత్యం బంధానికి ఆరంభం అని. కాని నేనంటాను - దాంపత్యం వైరాగ్యానికి ఆరంభం. శిక్షణ అక్కడ ఉన్నది. ఒకరికొరకు ఒకరు త్యాగంచేయడం ఉన్నది. బిడ్డ కలిగితే తన సౌందర్యం తగ్గుతుందని ఆ తల్లికి తెలుసు. అయినా బిడ్డ కావాలని కోరుకుంటుంది. బిడ్డను కని, తన రక్తాన్ని పాలుగా మార్చి, ఆ పాలతో బిడ్డను పెంచుతున్న వేళలో - ఒకరికొరకు ఒకరుగా బ్రతికిన వాళ్ళు ఇద్దరూ మరొకరి కొరకు బ్రతుకుతున్నారు. పట్టుచీర కొనడం మానేసి పాలడబ్బా కొంటున్నారు.

ఇలా రెండు విభిన్న మనస్తత్వాలు కలసి శృతి కుదుర్చుకొని జీవితంలో ప్రయాణం చేయడానికి ఒకరి యెడల ఒకరు ఒదిగితే - ఎంతటి శిక్షణ! ఎంతటి సహజీవనం! ఎంత త్యాగం! ఎంత వైరాగ్యం! ఎంత ఎదుగుదల!

దానికి పరాంకోటి స్థితిని సీతారాములు చూపించారు.

తల్లి కౌసల్యకు వెంట రావద్దని, భర్త వద్దనే నీ స్థానం అని చెప్పి, రాముడో అడవికి బయలుదేరుతూ ఉంటే—'నేనూ వస్తాను' అన్నది సీత.

'నీవా ?' అన్నాడు రాముడు.

సీతాదేవి ఎంత సొగసరో అంత గడుసరి. "తల్లికొక నీతి, భార్యకొక నీతినా?' అన్నది.

"అది అరణ్యం. అక్కడ రక్షణ ఉండదు. ఇక్కడ ఉండి నా తల్లిదండ్రు లను సేవించు."

"మీతో ఉండడమే ధర్మం అనుకుంటున్నాను."

"నీవు ఇక్కడ హాయిగా ఉండు."

"నేనొకటి గ్రహించాను. మీకు సౌందర్యం ఉంది. సామర్థ్యం లేదు. మా తండ్రి నన్ను పురుషరూపంలో వున్న స్త్రీకి ఇచ్చి పెళ్ళి చేశాడు అనిపిస్తున్నది. నాతండ్రి నన్ను రాముడికి ఇచ్చాడు తప్ప అయోధ్యకు ఇవ్వలేదు."

ఆ మాటకు రాముడు చిరునవ్వు నవ్వి, 'బయలుదేరు' అన్నాడు. 'నీవేమిటో చూద్దామని ఆ మాట అన్నాను. ఆవేశంగా వద్దామనుకుంటున్నావా, ఆచరణశీలివై వద్దామనుకుంటున్నావా, అని తెలుసుకుందామని అలా అన్నాను' అన్నాడు.

ఆ దాంపత్యంలో అరమరికలు లేవు. రాముడు ఎంత చనువు ఇవ్వకపోతే ఆవిడ ఆ మాట అనగలదు ?

ఆ తర్వాత అరణ్యవాసం చేస్తూ సీతారాములు ఋష్యాశ్రమాలను సందర్శిస్తున్నారు.

'ఈ వాతావరణంలో ధనుర్బాణములు ఎందుకు? వాటిని విసర్జిస్తే నష్టమేమిటి? సలహా ఇచ్చింది సీత.

ఈ ఋషులు ఏమి చెపుతున్నారు ? రాక్షసుల నుండి రక్షించమని అడుగుతున్నారు. మనం భరతుడి ప్రతినిధులం. ధర్మసంస్థాపన మన బాధ్యత' అంటున్నాడు రాముడు.

ఈలోగా విరాధుడు ఆమెను పట్టుకు వెళ్ళిపోతున్నాడు. రాముడు బాణం వేశాడు. యుద్ధం జరిగింది. విరాధుడు మరణించాడు.

ఆ తర్వాత శరభంగుని ఆశ్రమానికి వెళ్ళారు. ఆయన చెప్పబోయాడు విరాధ

గురించి. ఇప్పుడే నిర్ణింపబడ్డాడు-అని రాముడు చెప్పాడు సమస్కరించి. రాజు అలా ఉండాలి. సమస్యలను పూర్తిచేసి ప్రజలకు కనబడే వాడు పాలకుడు. సమస్యలను అట్టేపెట్టి ఓట్లు వేయించుకొనేవారు భిక్షుకులు.

అత్రి మహర్షి ఆశ్రమానికి వెళ్ళారు. వారి ఆతిథ్యాన్ని స్వీకరించారు. వారు పండు ముదుసలులు. ఋషి దంపతులు. అత్రిమహర్షి అన్నాడు 'అనసూయాదేవి ఆశీస్సులు మీకు మేలు కలుగజేస్తాయి. ఆవిడ మహా పతివ్రత. మహాతపస్విని. వెలుగు ముద్ద.'

ఆ దంపతుల అన్యోన్యతకు, తపశ్శక్తికి ముగ్ధుడైనాడు రాముడు. అనసూయ సీతాదేవిని దగ్గర కూర్చోబెట్టుకుని 'ఆయన అలాగే చెపుతారమ్మా. ఆయన సేవలోనే నాకీ శక్తులు వచ్చాయి' అని; 'నీవు భర్తవెంట వచ్చినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. ఈ కానుకలు స్వీకరించు. ఈ పూలమాల వాడదు. ఈ బట్టలు మాయవు. ఈ ఆభరణాలు నిన్ను రక్షిస్తాయి' అన్నది. సీతాకళ్యాణఘట్టాన్ని సీతతో చెప్పించుకుంది.

చిత్రమేమంటే రావణుడు ఎత్తుకుపోతున్నప్పుడు సీత ఆ చీరకొంగు చింపి ఆ ఆభరణాలు కట్టి క్రిందకు పడవేసింది. అవి వానరులకు దొరికాయి. వాటినిబట్టి వారు గ్రహించారు.

ఆ నిండైన దంపతుల ఆశీస్సుల బలం, ఫలం అది. పెళ్ళికి పిలవటం అలాంటి ఆశీస్సులకోసం. ప్రజెంటేషన్స్‌కోసం కాదు.

ఆ అరణ్యవాసంలో సీత బంగారులేడిని తెమ్మంది. ఆయనలేచి బయలుదేరాడు. ఇది రాక్షస మాయ - అన్నాడు లక్ష్మణుడు 'మీ వదిన ఎన్నడూ ఏదీ అడుగలేదు. అడిగింది. పోనీ తెచ్చిపెడదాం' రాక్షసుడైతే నష్టమేముంది? చంపుతాం. అంతేకదా' అన్నాడు రాముడు.

కథ మలుపు తిరిగింది. సీతను రావణుడు ఎత్తుకువెళ్లాడు. రాముడు ఎంతగా శోకించాడో చెట్లకు తెలుసు. పుట్టలకు తెలుసు. కొండలకు తెలుసు. గుహలకి తెలుసు.

అంతగా ఏడ్చిన రాముడు దేవుడు ఎలా అయ్యాడు?

ఏడుపులో రెండు రకాలున్నాయి. తనకోసం దుఃఖించడం, ఎదుటివారికోసం దుఃఖించడం. రాముని దుఃఖం ఈ రెండవ తరహా దుఃఖం. సీతా ఎక్కడున్నావు?

ఎలా ఉన్నావు ? రక్షణ ఇస్తానని తీసుకువచ్చి రక్షించుకోలేని వ్యర్థజీవిని నేను' ఇది దేవుడి దుఃఖం.

అలా దుఃఖిస్తూ సుగ్రీవాదుల దగ్గరకు వెళ్ళాడు. 'నేనూ అలాంటి దుఃఖంలోనే ఉన్నాను. నా భార్యను మా అన్న తీసుకుపోయాడు' అన్నాడు సుగ్రీవుడు. రాముడు సుగ్రీవునకు అభయమిచ్చాడు.

అంత బాధలో కూడా రాముడు కర్తవ్యంనుండి, ధర్మంనుండి దూరంకాలేదు. అదీ మానవ ధర్మం అంటే. రాముడు మానవజాతికి నేర్పేది అది. మనం బాధపడ వచ్చు. కాని కర్తవ్యాన్ని విస్మరించరాదు.

ఆ బాధలోనే శబరి దగ్గరకు వెళ్ళాడు. ఆవిడ పండ్లు పెడుతోంది. శబరికోసం తిన్నాడు.

అదీ రామ స్థితి. ఇన్ని బాధలమధ్య ఎవరిని ఎలా చూచుకోవాలో, ఎలా దగ్గరకు తీసుకోవాలో, ఎవరు తననుండి ఏమి కోరుతున్నారో వారికి అది ఇచ్చుకుంటూ ముందుకు సాగిన ఆ దివ్యమూర్తి దుఃఖాన్ని మనం చూసితీరాలి.

వారధి కట్టాడు. యుద్ధం జరిగింది. రావణ వధ అయిపోయింది. ఎన్నాళ్ళకు రాముని జీవితంలో వసంతం - అని వానరులంతా పండుగ చేసుకుంటున్నారు. ఆ సీతాదేవిని చూడాలని కళ్ళు పెద్దవి చేసుకొని కూర్చున్నారు. సీతాదేవి సమీపిస్తున్నది. రాముడు ఒక్కసారి ఉగ్రనేత్రుడై పోయాడు. ఏమిటీ అనుకోని సన్నివేశం? ఇన్నాళ్ళు గుండె పగిలినట్లు ఏడ్చిన రాముడు సీతాదేవి కనపడితే ఆగగలడా ? ఆగ గలగడమే కాదు. ఆగు అన్నాడు.

ఆ ధర్మమూర్తితో ఉన్న ఇబ్బంది అది. అంత దుఃఖాన్ని ఇక్కడ పెట్టేసు కొని, 'సీతా ఆగు'-అన్నాడు. ఒక్కసారి కంపించిపోయింది సీత.

'సంతోషం. పరాధీనవైన నిన్ను రక్షించాను. నీకు స్వేచ్ఛ నిచ్చాను. నీవు కోరినచోట ఉండవచ్చు. ఇది రాముని నిర్ణయం.'

ఎదురుచూసిన వానరులందరూ బెంబేలు పడిపోయారు.

సీతాదేవి ఒక్కసారి ఇలా చూసింది. 'లక్ష్మణా, చితి పేర్చు' అన్నది.

లక్ష్మణుడినే ఎందుకు పిలవాలి? రాముడలా ఎందుకన్నాడో ఆవిడకు తెలుసు. మరెవ్వరికీ తెలియదు. విషవృక్షాలు వ్రాసేవారికి తెలియదు. అంటించడంలో స్పెషలిస్టు హనుమను ఎందుకు పిలవలేదు ?

ఆ మాటకు లక్ష్మణుడు కంపించిపోతున్నాడు. శ్రీరామచంద్రుడు ఇలా ాడు ఒక్కసారి. లక్ష్మణుడు సమీపిస్తున్నాడు. సీతాదేవి అలా ఒదిగిచూస్తా ది.

కారణమేమి ?

లక్ష్మణునితో ఏమన్నది సీత? మారీచుడు మాదగొంతుతో 'హా సీతా, హా ణా' అని అరచినప్పుడు సీతాదేవి ఏమన్నది ?

"మీ అన్న ప్రమాదంలో ఉన్నాడు. వెళ్ళి రక్షించు."

"తల్లీ! అన్నకు ప్రమాదం ఉండదు. అన్నను జయించగలిగినవాడు లేడు ోకంలోనూ-ఇదేదో రాక్షస మాయ. మీరు తొందరపడకండమ్మా."

"లేదు. వెళ్ళు."

"నేను వెళ్ళకూడదు. మా అన్నయ్య బాధ్యత నాకు అప్పగించాడు. నాదగ్గర సం ఉంచాడు మిమ్మల్ని. నా అన్నకు ప్రమాదం లేదు. మీరు శాంతించండి."

"లక్ష్మణా, మిత్రుడి రూపంలోవున్న శత్రువు నీవు. మీఅన్న ఒకవేళ శరీరం ి పెడితే నీకు నేను దక్కుతాననుకుంటున్నావా ? నీ బుద్ధిలో నాకేదో దోషం పడుతున్నది. నీకు నామీద దృష్టి ఉన్నట్లు నాకనిపిస్తున్నది. ఓ దురాశాపరుడా ! డు తిరిగిరాకపోతే అగ్నికి ఆహుతై దగ్ధమైపోతాను కాని, ఈ గోదావరిలో కొట్టుకుపోతానుకాని నీకు దక్కుతాననుకుంటున్నావా ?"

"తల్లీ!" అని చెవులు మూసుకున్నాడు లక్ష్మణుడు.

"ఆ బాధ లక్ష్మణుడు ఎలా అనుభవించాడో నీకు ఎలా తెలుస్తుంది ? అతడు త కంపిపోయాడో, ఎంత చింపిపోయాడో, ఎంతక్షోభించి ఉంటాడో క్షణమాత్ర ఆలోచించావా? మనబిడ్డను అలా అనవచ్చునా?" అన్న ఒక ఉగ్రత్వం రాముని ళ్ళల్లో ఉన్నది.

"అధర్మాన్ని నేను సహించలేను. తమ్ముడైనా సరే. భార్య అయినా సరే. ెరికి నేనైనా సరే" అన్న ఉగ్రత రామునికళ్ళల్లో ఉన్నది.

అది ఆవిడకి అర్థమైపోయింది. "లక్ష్మణా, చితి పేర్చు" అన్న మాటకు

అర్థమది. 'అర్థమయింది నాయనా నిన్ను ఎంత క్షోభపెట్టానో నన్ను క్షమించు బాబూ! నీవే అగ్నిని రగుల్చు.'

అతడు క్షోభిస్తూ అగ్నిని రగిల్చాడు. అగ్నిదేవుడు పునీతంచేసి సీతను తీసుకు వచ్చాడు. దేవతలు వచ్చి ఆశీర్వదించారు.

రాముడి దగ్గర ఒక గుణం ఉన్నది. ఆ పాయింట్ నీకు అర్థం కావాలి. అంతే. అంతకంటే ఇంకేమీ అక్కర్లేదు.

పసివాడు, మనని నమ్ముకున్నవాడు, భార్యను వదలి, మన సేవకోసం వచ్చి, అహోరాత్రాలు మనతో పడి ఉన్నవాడు, మనిద్దరినీ ఒకచోట కూర్చోపెట్టి ఆహారమూ, పానీయమూ ఇచ్చినవాడు, మనకు పర్ణశాల వేసిపెట్టినవాడు. మనకోసం దూలాలు మోసినవాడు, మనను సర్వస్వంగా భావించి కంటికి రెప్పలా కాచుకున్నవాడు, ఆ లక్ష్మణుని ఎంతమాట అన్నావు? ఆ బాధ నీకు తెలియాలి. అంటే నిన్ను అలాంటి స్థితిలో పెట్టాలి నలుగురి మధ్య.

ఇది రామాయణంలో ఉన్న ధర్మసూక్ష్మం, ధర్మనిష్ఠ.

అది అయిపోయింది. అంతే! 'సీతా, రా! నీవు లేనిదే నేను ఉండగలనా ?'

ఆ భార్యాభర్తల అనుబంధం చూడండి. ఆ అనుబంధానికి మధ్య ధర్మానికి ఉన్న స్థానం చూడండి. ఆ ధర్మాన్ని నిలబెట్టుకుంటూ ఒకరికో ఒకరు ఎలా ఎదిగారో చూడండి. తప్పులను గ్రహించుకుంటూ, దిద్దుకుంటూ వారెలా ముందుకు సాగారో చూడండి.

పట్టాభిషేకం తర్వాత ప్రజలు అపవాదు వేసిన వేళ - రాజ్య రక్షణకోసం బాధ్యతా నిర్వహణకోసం సీతాదేవి తనకు దూరమైపోతున్న వేళ మళ్ళీ కర్తవ్య దీక్షితుడై ధర్మనిష్ఠుడైన శ్రీరాముడు ధర్మనిష్ఠురాలైన సీతాదేవి ఒకరినొకరు చూసుకుంటే ఎలా ఉంటుంది ?

'రాజ్యంమీద వ్యామోహంతో విడిచిపెడుతున్నావా'అంటే? చిన్ననాటినే రాజ్యాన్ని విడచి అరణ్యానికి వెళ్ళినవాడిని, రాజ్యం ఎడల బాధ్యతతో మనమిద్దరం ఈ బాధను అనుభవిద్దాం. సీతా! దాంపత్యానికి బాధ్యతా నిర్వహణలోనే తృప్తి ఉంటుంది. ధర్మ నిర్వహణలోనే తృప్తి వుంటుంది. కనుక మనం ఒక పని చేద్దాం. కలసి ధర్మాన్ని ఆచరించి తృప్తి పొందుదాం. ధర్మానికి అంకితమై తృప్తి పొందుదాం. ఈ రాజ్య రక్షణకోసం, ఈ ప్రజలలో ధర్మనిష్ఠ నిలబడడం కోసం - నేనిక్కడ,

నీవక్కడ. ఈ బాధ్యతలు నిర్వహించినంత కాలం మనిద్దరికీ ఒకే బాధ. నేను లేనన్న బాధ నీకెంతో, నీవు లేవన్న బాధ నాకంతకానీ ఈ బాధలు ఆ బాధ్యతముందు ఎంత? కనుక సహధర్మచారిణీ! ఒకే ధర్మానికి అంకితమై జీవితాలను సాగించామన్న తృప్తిలో ఆనందం ఉంది కనుక-ఆ అద్వైతస్థితిలో బ్రతుకుదాం.

ఆ ధర్మనిర్వహణకోసం వారు కలిశారు. ఆ ధర్మ నిర్వహణకోసం వియోగం చెందారు. మళ్ళీ ధర్మ నిర్వహణలో కలిశారు. మళ్ళీ ధర్మ నిర్వహణకోసం ఎడ మయ్యారు.

ఇలా లోకంలో జరుగవలసిన ధర్మసంస్థాపనకోసం తమ దాంపత్య జీవితాన్ని అంకితం చేసిన ఆ దంపతులు ధన్యులు.

సుఖం అంటే ఎవరి అర్థం వారిది-సీతారాముల అర్థం సీతారాములది. ఒకే ధర్మానికి అంకితమైనామన్నది నిజమైన సుఖం కనుక-సీతారాములు పడ్డంత సుఖం ఈ భూమిమీద ఇంకెవరూ పడలేరు.

తెలియకపోతే సీతారాములు దుఃఖపడ్డారని అనిపిస్తుంది. తెలిస్తే-అదే నిజమైన తృప్తి, నిజమైన సార్థకత, నిజమైన పరిపూర్ణత. ఈ లోకంకోసం, ధర్మ సంస్థాపన కోసం, దేవతల కార్యనిర్వహణ కోసం రాముడు ఎంత పని చేశాడో; సీత అంత పని చేసింది. కనుక సీతాయాః చరితం మహత్.

సీతారాములు సార్థక జన్ములు. అలాంటి దంపతులుగా, బాధ్యతానిర్వహణలో తృప్తి పొందువారుగా జీవించగలిగితే వారి జీవిత సన్నివేశాలకు అర్థం తెలుస్తుంది. సీతారాముల అర్థం కావడానికి మనం కూడా సీతారాములం కావలసి ఉన్నది.

ధర్మాంకిత స్వభావులు, ఆదర్శ దంపతులుఅయిన సీతారాములు చిరంజీవులు. ఇవాళ కూడా ప్రతి వివాహంలో వారి బొమ్మలతోనే మనం వివాహం చేస్తున్నాం. వారెలా తలంబ్రాలు పోసుకున్నారో అలాగే మన పిల్లలు పోసుకోవాలని అనుకుంటు న్నాము. 'వారు పొందినంత తృప్తి మన బిడ్డలు పొందుదురుగాక. వారు ధర్మానికి అంకితమైనట్లుగా మన బిడ్డలు అంకితమగుదురుగాక. కష్ట-సుఖాలలో ఒకటిగా కలసి మెలసి నడుచుకుందురుగాక. అలా మన జన్మలు ధన్యము లగునుగాక' అన్న భావన ఈనాటికి మన మనస్సులలో కలిగిస్తున్న ఆ పుణ్యదంపతులకు నమస్కరిస్తున్నాను.



# స్నేహానుబంధం

అవ్యాజంగా ఏర్పడిన మైత్రి అద్వైతాన్ని అనుభవానికి తెస్తుంది. రామాయణంలో ఈ అనుబంధాన్ని పరిశీలిద్దాం.

రావణ, మారీచుల స్నేహం చూద్దాం. రావణుడు మారీచుని వద్దకు వెళ్ళి 'నాకో పని చేసిపెట్టాలి' అన్నాడు. మారీచుడు అన్నాడు— 'ఇది మంచి పద్ధతి కాదు. నీ మంత్రులను సంప్రదించావా ? మండోదరిని సంప్రదించావా ? రాముని మీదకు నీవు చాల మందిని ప్రయోగించావు. వారంతా అక్కడే మరణించారు. నూరు యోజనాల దూరం నన్ను విసరివేసిన రాముని బాణందెబ్బ నాకు తెలుసు. అది ఆయన 12వ ఏట వేసిన బాణం. నీవుచేసే పాపపు పనికి నీ చుట్టూ ఉన్న వారంతా బలి అయిపోతారు. నీవు అడగకపోయినా, మైత్రీధర్మంగా నీ శ్రేయస్సుకోరి ఈ మాట చెపుతున్నాను. కోరుకోవటం, దోచుకోవటం తప్ప— చేయవలసింది ఏమిటో తెలుసుకునే వివేకం నీకు లేదు.'

'సహాయం చేస్తావా, నిన్ను మట్టుపెట్టనా— ?' అన్నాడు రావణుడు.

'నీ చేతిలో చనిపోయేకన్న రాముని చేతిలో చనిపోవడం మేలు. కనుక నీ పని చేసిపెడతాను. ఇదిగో, నేను బంగారులేడినై కదలి వెళుతున్నాను' అన్నాడు మారీచుడు.

రావణుడు సీతను ఎత్తుకుపోతూవుంటే, జటాయువు ఒక్కసారిగా పైకి లేచాడు. ఇతను మహామిత్రుడు. దశరథునికి మిత్రుడు. కొన్ని వేల సంవత్సరాల వయస్సు కలిగిన పక్షిరాజు. నా మిత్రుని కోడలికా ఇంతటి దుస్థితి— అనుకున్నాడు. 'ఆగు'-అన్నాడు. రావణుడిని ఎదిరించాడు. గోళ్ళతో రక్కేశాడు. పీకేశాడు. అతడు ఎక్కుపెట్టే విల్లును తునాతునకలు చేశాడు. వృద్ధుడైన జటాయువుకూ, కామరూపుడైన రావణునికీ యుద్ధం జరిగింది. చివరికి జటాయువు అలసిపోయాడు. రావణుడు

అతడి రెక్కలు నరికివేశాడు. క్రిందపడుతూ జటాయువు రావణునితో అన్నాడు - 'నీవు చేసేది మహాఘోరం, మహానేరం, నీవు నశించిపోతావు.'

'పో పక్షీ'—అన్నాడు రావణుడు.

పడిఉన్న జటాయువుకు ప్రాణం కడబడుతున్నది. రామలక్ష్మణులకు ఈ కబురు చెవిన వేయాలని ఆయన కోరిక. 'నా ఊపిరిని' వెళ్ళిపోతున్న నాప్రాణాలను కాసేపు ఉండనీ. నా రాముడు వచ్చేవరకూ ఉండనీ. మా మైత్రి అది— అనుకుంటున్నాడు జటాయువు. రెక్కలు పోయాయన్న బాధ లేదు. కాళ్ళు పోయాయన్న బాధలేదు. రక్తపుమడుగులో పడిపోయానన్న బాధలేదు. రాముడికి కబురు చెబితే చాలు అనే కోరికమాత్రం ఉన్నది.

రామలక్ష్మణులు వెతుక్కుంటూ అక్కడకు వచ్చేటప్పటికి-రక్తపుమడుగులో, జటాయువు పడిఉండడం కనబడింది. 'నేను జటాయువును' అనేటప్పటికి రాముడు స్తంభించిపోయాడు. ప్రక్కన కూచోబెట్టుకుని- 'ఏమిటిలా అయిపోయావు ? సీతను ఏమైన చూశావా? చెప్పగలిగితే చెప్పు' అన్నాడు.

'సీతను ఎత్తుకుపోతుంటే రావణాసురుడిని అడ్డగించిన కారణాన నాకీస్థితి వచ్చింది. నా గురించి నీవు ఆలోచించకు. నాకు బంగారుచెట్లు, వాటినుండి వట్టివేళ్ళ వంటి కేశములు కనబడుతున్నాయి. ఈ దృశ్యం సమీపిస్తున్న మృత్యువును తెలియజేస్తుంది. రావణాసురుడి నుండి సీతను నేను రక్షించలేకపోవచ్చు. కాని ఆ వేళకు ముహూర్తం కట్టాను. విందము అనే ముహూర్తం కట్టాను. అందులోవున్న వస్తువును ఎవరైనా అపహరించితే, ఆ వస్తువు తప్పక యజమానికి చేరుకుంది'— అన్నాడు జటాయువు.

అంటే మొట్టమొదట రావణుని చావు చూసినవాడు జటాయువు. 'సీతాదేవి నిన్ను తప్పక చేరుకుంటుంది' అని చెప్పినవాడు జటాయువు. అలా ఎగిరిపోతున్న రామునిప్రాణాలు నిలబెట్టినవాడు జటాయువు.

జటాయువు ఇంకా అంటున్నాడు— 'నీ తండ్రి-తండ్రి నాకు తెలుసు. ఏల సంవత్సరాలుగా మీ వంశంతో అనుబంధం ఉన్నది మాకు. ఆ మైత్రితో చివరికి నీ చేతులమీదుగా నేను ఈ శరీరాన్ని విడిచిపెడుతున్నాను.'

అలా అని ఆ జటాయువు ఆ శరీరాన్ని విడిచిపెడితే — మరొకరైతే సీతాదేవి సంగతి తెలిసింది కనుక అటువైపు పరిగెడతారు. కాని రాముడు పరిగెత్తలేదు.

జటాయువు చాల పెద్దవాడు. వేల సంవత్సరాలు బ్రతికినవాడు. మానవులతో స్నేహము చేసినవాడు. తండ్రి తరువాత తండ్రి అంతటివాడు. అతడికి వేదోక్తమైన దహనసంస్కారములు జరిపాడు రాముడు.

రామాయణంలో రెండవ స్నేహితుడు జటాయువు. చిట్టచివరి క్షణాల వరకు తన జీవితాన్ని ధన్యం చేసుకున్నవాడు. రామునికి ప్రాణం పోసినవాడు. నిజానికి ఎవరి జీవితంలో అయినా అంతే. మనకు కష్టం వచ్చినా, సుఖం వచ్చినా మనను పలకరించేది మన మిత్రుడే. ఒక మైత్రీహస్తం కావాలి మన కన్నీళ్ళు తుడవడానికి.

ఆ తర్వాత హనుమంతుడు సుగ్రీవుడిని పరిచయం చేసినప్పుడు— ముందుగ అతడి బాధ తెలుసుకున్నాడు. అగ్నిసాక్షిగా మైత్రి చేసుకుని 'నేనున్నాను నీకు' అన్నాడు. 'మా అన్నయ్య నన్ను బాధిస్తున్నాడు' — అంటే, 'వాడిని వధిస్తాను' అన్నాడు. దానికి ప్రతిగా "నేను సీతాన్వేషణము చేసిపెడతాను" అని సుగ్రీవుడన్నాడు.

ఆ ప్రకారం రాముడు వాలిని వధించాడు. సుగ్రీవుడికి రాజ్య పట్టాభిషేకం చేశాడు. తానుమాత్రం ఆ కొండగుహలోనే ఉంటున్నాడు. లక్ష్మణునితో 'అన్వేషణకు బయలుదేరే సమయం వస్తున్నది. సుగ్రీవుని నుండి కబురు లేదు. సుగ్రీవుడు తన పని ఉన్నంతవరకు తిరిగాడు. పని అయిపోయింది. తప్పతాగి ఎక్కడో పడిపోయాడు. ఎంతకూ రావడంలేదు.' లక్ష్మణునికి కోపం వచ్చేసింది. 'అతని అంతు చూస్తాను' అన్నాడు. రాముడన్నాడు- 'తొందరపడకు. వెళ్ళి, వాలిని వధించిన అస్త్రం ఇంకా అమ్ములపొదిలోనే ఉన్నదని నా మాటగా చెప్పు.'

అంటే అర్థం ఏమిటి? ధర్మాన్ని అతిక్రమించినట్లయితే — వాలి అయినా ఒకటే, సుగ్రీవుడయినా ఒకటే.

లక్ష్మణుడు మంచి కోపంమీద వెళ్ళాడు. తలుపు కొట్టాడు. తలుపు తీసింది తార. లక్ష్మణుడు ఆగిపోయాడు. 'సుగ్రీవుడి సంగతి నాకు తెలుసులే-అతడిని నిద్ర లేపి, కర్తవ్యోన్ముఖుడిని చేస్తానులే' అన్నది తార. రాముని సందేశంవిని సుగ్రీవుడు మళ్ళీ కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించాడు.

సుగ్రీవుడిదీ స్నేహమే. ఆటుపోట్లతో కూడిన, ఆవేశాత్మకమైన స్నేహం. ప్రయోజనాపేక్ష కలిగిన స్నేహం. ప్రయోజనం తీరితే మరిచిపోగలిగినటువంటి వాసనాత్మకమైన స్నేహం. ఏమరుపాటు కలగడం, మేలుకొలుపవలసి రావడంఅనేది జీవలక్షణంగా ఉన్నవాడి స్నేహం. అతడివంటి వాళ్ళు చాలమంది ఉంటారు. అర్థ

రాత్రి బిడ్డకు జ్వరంవస్తే- 'తండ్రీ, తగ్గితే నీ కొండకు వస్తాం' అనే వాడున్నాడు. జ్వరం తగ్గుతుంది. పదేళ్ళు గడిచినా కొండకు వెళ్ళరు. తీరిక లేదంటారు.

మానవ మనస్తత్వానికి ప్రతీకగా సుగ్రీవుడు అక్కడ కనబడతాడు. మానవుని మనస్సు ధర్మంపైన నిలబడాలంటే చాల సాధన కావాలి. ఏమాత్రం అవకాశమున్నా ధర్మంనుండి పక్కకు వచ్చేస్తుంది అది.

తన స్వార్థం ఏమాత్రం లేకుండా పనియందు మనసు నిలిపినవాడు కనుక, రాముడు అవతారమూర్తి అయినాడు. ఒకసారి మాటఇస్తే, ఆయన ఇంకొకలా ఉండ లేడు. ఆ స్టేచర్ ఉండాలి. తనతో ఉన్నవాడిని తనతో సమానంగా, తనమయంగా, తనలో భాగంగా చూసుకోగలిగిన స్టేచర్ అక్కడ ఉన్నది.

తరువాతి స్నేహితుడు విభీషణుడు. విభీషణుడు వచ్చి శరణు అంటున్నాడు— అంటే రాముడు అందరూ కూర్చొనివుండగా సుగ్రీవుడిని అడిగాడు-ఇప్పుడేం చేద్దాం అని. 'విభీషణుడిని మనం అంతగా నమ్మకూడదు. అతడు శత్రుపక్షంలోని వాడు. విపత్కర పరిస్థితులలోవున్న తన అన్నను వదలి వచ్చినవాడు. తన అన్నకు వ్యతి రేకంగా పని చేస్తున్నవాడు' అని సుగ్రీవుడు అన్నాడు. రాముడు చిరునవ్వు నవ్వాడు. ఎందుకంటే — ఆ మాట మరెవ్వరైనా అనవచ్చుకాని సుగ్రీవుడు అనకూడదు.

సరే. రాముడు అందరినీ అడుగుతున్నాడు. చివరికి ఆంజనేయుడు 'లంకకు వెళ్ళినప్పుడు ఇతడిని నేను రావణుడి కొలువులో చూశాను. ఇతని ముఖంలో, ప్రవర్తనలో, మాటలో సత్వగుణం నాకు కనబడింది. రావణుని ప్రవర్తనను అతను ఇష్టపడకపోవడం నేను గమనించాను. నా దృష్టిలో విభీషణుడు నీకు తగిన మిత్రుడు. ఎలాగంటే దండకారణ్యంలో రావణుడు చేస్తున్న ప్రయత్నాలు, విశ్వామిత్రయాగంలో అతని పాత్ర మీ సంరక్షణ, మారీచసుబాహుల కథ— ఇవన్నీ విభీషణుడికి తెలుసు. రావణుని ప్రవర్తన, దానికి మీ ప్రవర్తన అతడు గమనిస్తూ వచ్చాడు. గమనిస్తూ ఉండగా అతడిలో రావణునిపై వైరుధ్యం, మీపై ప్రేమ పుట్టుకువచ్చాయి.'

'అతడు మీ గుణములతో మైత్రి చేయడం ఎప్పటినుండో మొదలుపెట్టినాడు. మీ దర్శనంకోసం ఎదురు చూస్తున్నాడు' అన్నాడు. రాగద్వేషాలకు లోనుకాకుండా అవతలివ్యక్తిని అంచనావేయడంలో ఆంజనేయుడు ఎంతటివాడో రాముడు చూశాడు.

రాముడన్నాడు-'సుగ్రీవా, లోకరీతిలో నీకు ఒక మాట చెప్తుతాను. జ్ఞాతివైరం సహజం. ఆవిధంగా అయినా మనం విభీషణుడిని స్వీకరించవచ్చు. నాకు సంబంధించి

నంతవరకు ఒక్క మాట చెపుతాను. నేను ఎలాంటి పరిస్థితులలోవున్నా — 'నేను మిమ్మల్ని శరణు వేడుకున్నాను' అని ఎవరు అన్నప్పటికీ, నేను అతడికి అభయం ఇచ్చి తీరుతాను. ఇది నా ప్రతిజ్ఞ. ఆ వచ్చిన వాడిని నేను అనుమానించను. విశ్వసిస్తాను. అయితే అతడు ఇంకొక విధంగా ప్రవర్తిస్తే అతడిని విడిచి పెట్టను. ఈ కనిపించే సకల లోకములలోని జీవులను దమించగల శక్తి ఈ రామునికి ఉన్నది. కనుక, తిరగబడి అతడు చేయగలిగింది లేదు. సుగ్రీవా, ఈ ధర్మం ఉన్నది కనకనే నేను అభయం ఇచ్చాను. నీవు ధర్మాన్ని అతిక్రమించినవేళ — నా విల్లుచూపి మళ్ళీ నిన్ను దారిలో పెట్టుకున్నాను.'

అలా విభీషణుడు వచ్చి-'నేను మీకు శరణాగతి చెందుతున్నాను' అన్నాడు. అప్పుడు 'నీవు నావాడివే' అని హృదయానికి హత్తుకున్న రాముడు మనకు ఆదర్శం.

కనుక - ఎదుటివారిని అనుమానించే వారికి స్నేహితులు ఉండరు. అనుమానించని వారికి నిజమైన స్నేహితులు ఉండే అవకాశం కలుగుతుంది. వారిని ఎవరూ మోసం చేయలేరు. అలాంటి దివ్యశక్తి వారిచుట్టూ ఆవరించి ఉంటుంది. కాబట్టి ఓ మానవుడా! నీవుగ-ఎవరినీ సందేహించకు. అందరికీ అవకాశం ఇవ్వు. అందరినీ అదుపులో పెట్టగల శక్తి నీకు ఆ దైవమే ప్రసాదిస్తాడు.

చివరగా - వారధి కట్టేవేళ రాముడు ఉడుతతో స్నేహంచేసిన తీరు చూడండి. ఆ ఉడుత అలా నీళ్ళలో మునిగి, ఇక్కడ ఇసుకలో పొర్లి, అలావెళ్ళి వారధిపై విదల్చింది. అలా అనేకమారులు చేస్తూవుంటే-రాముడు చూసి, ఆ ఉడుతను పట్టుకుని ఒక్కసారి ఇలా నిమిరాడు. ఉడుతలతో కూడ మాట్లాడ గలిగిన మహనీయుడు రాముడు. కనుకనే జటాయువును 'మిత్రుడా' అన గలిగాడు. ఇక్కడ ఉడతను 'మిత్రుడా' అనగలిగాడు. సకల జీవరాసులతో మైత్రి చేయగలిగిన మహనీయుడు, మహిమాన్వితుడు ఆ రాముడు.

కనుక-మనచుట్టూవున్న సకల భూతములతో మనం నేస్తం చేద్దాం. మనుషులతో, జంతువులతో, వస్తువులతో, తుదకు మనకు పని చేసిపెట్టే కలముతో కూడ స్నేహం చేయడం మనం నేర్చుకోవాలి.

సకల జీవరాసులతో స్నేహం చేయగలిగిన దివ్యస్థితి మానవునికి ఉన్నది. కనుక-ఆ శ్రీరాముడు నదిని దాటుతూ నదికి కృతజ్ఞతలు చెప్పాడు అంతే కాదు. భవనాలకు కృతజ్ఞతలు చెప్పాడు. అణువు నుండి బ్రహ్మాండము వరకు ఉండేది దైవ

ప్రజ్ఞే కనుక, ఆ రూపముగా అతడు ఉండడానికి ఇష్టపడుతున్నాడు కనుక, ఆయా రూపాలతో స్నేహం చేయడం మనం నేర్చుకుందుముగాక. అది మనం అలవాటు చేసుకున్నవేళ-జీవితమే స్నేహమయం. మనం స్నేహం చేయడం మొదలుపెడితే, సకలవస్తువులూ మనతో సహకరిస్తాయి. ఆ వస్తువులతో చేసే స్నేహాన్నిబట్టి ఆ వస్తువులు రాణించడం అనేది ఉంటుంది. ఒక్కొక్కడి చేతిలో ఆ పరికరం, ఆ వీణ, ఆ సన్నాయి అలా ఒదిగిపోతుంది. ఆ వ్యక్తిలోని స్నేహం, ఆరాధనాభావం అక్కడ పని చేస్తుంది.

సర్వముతో స్నేహం చేయడం మన భారతీయ ధర్మం. కాని, ఇవాళ వ్యాపారదృష్టితో చూడడం మనకు అలవాటైపోయింది. వ్యవసాయదారుడు భూమితో, నీటితో స్నేహం చేసేవాడు. ఇవాళ ఎన్ని బస్తాలు పండుతుందా అనే వ్యాపారసరళిలో పొలాన్ని దున్నుతున్నాడు. పూర్వపు వైభవాన్ని, తృప్తిని కోల్పోతున్నాము.

అలాగే 'ఫలానా వంశంలోని అమ్మాయి మనింటికి కోడలుగా వస్తే చాలు' అనే నేస్తం ఉండేది. ఇవాళ మన వివాహం వ్యాపారపరమైపోయింది. చివరికి మనకు బిడ్డలుకూడ వ్యాపారమై పోయారు.

జీవితంలో స్నేహమనే తీపిని అనుభవించాలి. అది రాముడు హృదయపూర్వకంగా అనుభవించినవాడు, అందించినవాడు. కనుక ఆయన శ్రీమంతుడైనాడు. 30, 40 ఏళ్లుగా మనం వ్యాపారమయమైనస్థితికి వెడుతున్నాం. మళ్ళా మనం వెనుకటి స్నేహాన్ని అలవరచుకుందాం.

ఆధ్యాత్మిక ఉపన్యాసాలకుసైతం - 'మీ ఊరిలో చెపితే ఎంత ఇస్తావు?' అని అడుగుతూ ఉంటే, ఇక వ్యాపారం కానిది ఏది? గుడులు హోటళ్ళుగా మారిపోయి, దేవుళ్లలిస్టులు ప్రేలాడదీసి, కొబ్బరికాయ కొడితే ఇంత, హారతి ఇస్తే ఇంత, అంటుంటే ఇక వ్యాపారం కానిది ఏది?

ఇవాళ మనం కొడుకును అలాగే చూస్తున్నాం-'రెండు లక్షలు చేస్తాడా, ఇంకా ఎక్కువ చేస్తాడా?' అంటున్నాం. ఆ వచ్చిన అమ్మాయి కూడ అలాగే చూస్తుంది. వివాహం అయిన పదేళ్ళ తర్వాత పక్కింటావిడతో మాట్లాడుతూ - 'మా వాళ్ళు మరో పదివేలు పెడితే ఇంజనీరు వచ్చివుండేవాడు' అంటుంది.

మనం మళ్ళీ రామధర్మమునకు, ప్రేమధర్మమునకు నోచుకుందుము గాక. ప్రేమధర్మమును పండించుకొందుముగాక. పోగొట్టుకున్నది తిరిగి పొందుదుముగాక.



# ఆరాధనా వైఖరులు

రాముడిని తండ్రీ, తల్లీ, తమ్ముళ్ళూ, మిత్రులూ అలాగే శరణాగతి చెందినవారూ, భక్తులూ-అంతా ఆరాధించారు. ఇందరిచేత ఆరాధింపబడిన ధర్మవిగ్రహుడు ఆయన. అయితే ఇందులో ఎవరి ఆరాధనా వైఖరి వారిది. ఎవరి ప్రాప్తి వారిది.

దశరథుడు రాముడిని గారాబంతో పెంచాడు. విశ్వామిత్రుడు వస్తే, అతనిని వదులుకోలేను అన్నాడు. చివరకు ఆ మమకారంకోసం తన ప్రాణాలు సైతం వదులుకున్నాడు. చిత్రమేమిటంటే మమకారాల మధ్య ప్రతి తప్పుతున్న, గతి తప్పుతున్న దశరథుని జీవితానికి ఆ మమకారాన్నే ఆరాధనగా మలచి పరిష్కారాన్ని అందించాడు రాముడు. రాముడు పుట్టకపోతే దశరథుని కథ ఏలా ఉండేదో? ఏ కైక యొక్క అంతస్తులోనో పడి ఉండేవాడేమో! ఆ మమకారం మరొక మమకారంపైన దెబ్బ కొట్టగా, రాముడి పైగల మమకారానికై సర్వాన్ని త్యజించి, 'నా రాముడు ధర్మనిష్ఠుడు. అరణ్యాలకు వెళ్లమంటున్నావు. కైకా! నీవు రాక్షసివి' అన్నాడు. అక్కడికక్కడే ఆమెపై గల మమకారపు బంధాలు తెగిపోయాయి. 'రాముడు సర్వశ్రేష్ఠుడు, లోకోత్తరుడు. అతడిని నీవు వెళ్లమంటావా?' అని అడిగేశాడు. భార్య అనే మమకారం నుండి కొడుకు అనే మమకారానికి ప్రయాణం చేశాడు. రాముడు సకలగుణాభిరాముడు అనే లోకోత్తరమైన దర్శనం పొంది, అతడిని కీర్తిస్తూ అతడిలో లీనమైన ఆరాధన దశరథునిది. అతడిని విడిచిపెట్టలేక ఏడిచాడు. ఆ రోదనలో ఒక ఆరాధన.

తరువాత రాముడిని అంతగా ఆరాధించినది కౌసల్య. దశరథుడి నుండి ఆమె ఏమి పొందినది ? 'నేను పట్టమహిషిని కదా. నాకు జరగవలసినంత ముచ్చట జరిగినదా ? అన్న భావన రానీయకుండా పట్టమహిషిగా నేను గంభీరంగా హుందాగా ఉండాలి.' తనకు లోటే ఉన్నదో, బాధే ఉన్నదో, సమస్తమును తనలోనే ఉంచు కొని, దానినొక తపస్సుగా మలచుకొని, దశరథుడినీ, రాజ్యాన్నీ ఆరాధించుకున్నది కౌసల్య. ఆమె ఆరాధనకు ఫలితంగా సాక్షాత్తు నారాయణుడు ఆమెకు కొడుకుగా దిగివచ్చాడు. ఆ సంగతి ఆమెకు తెలుసు. కనుకనే ఆ తృప్తితో, ఇన్నినాళ్ల నా తపస్సు ఫలించి. నారాయణుడు నా బిడ్డయై నా ఇంట నడయాడితే, ఈ నా జన్మ ధన్య మని, ఆ కొడుకులో సమస్తాన్ని చూచుకొని, దేవుడిని కొడుకుగా, కొడుకును దేవునిగా ఆరాధించిన తల్లి ఆమె. కనుకనే 'నీవు ఇక్కడే ఉండాలి. నాతో అడవికి రాకూడదు' అని రాముడు అన్నప్పుడు ఆమె ఆ కొడుకులో దైవమును చూచింది. అది దైవాజ్ఞగా భావించి ఆ కౌసల్య తరించింది.

మరి కైకేయి మాట ఏమి ? పైకి కైకైమని అరవ వచ్చుగానీ, ధర్మసంస్థా-పనంలో పెద్ద పాత్ర ఆవిడదే. ఆమె వేసిన తప్పటడుగో, తప్పటడుగో రాముడిని అరణ్యాల పాలుచేసి ఇంతకథ నడిపింది. తాను కోరుకున్న కోరికల ఫలితాలు చూసి పశ్చాత్తాప పడి, 'రామా, నేనింత' దుష్టురాలిని అయిపోయానేమి ? నేను నిన్ను దైవముగా గుర్తించి కూడా నా కన్నులకు ఇన్ని పొరలు క్రమ్మివేసినాయి ఏమి' అని పశ్చాత్తాప రూపమైన ఆరాధనలో కైకేయి తరించింది.

ఇక సుమిత్ర 'నా చేతులతో నీకు సేవ చేసుకోవాలని ఉంది. కాని నీవు నాకు బిడ్డవైపోయావు. కనుక నా రెండు చేతులనూ నా బిడ్డలుగా చేసి నిన్ను, నీ ప్రజా శికను అర్చన చేసుకునే అవకాశాన్ని పొందాను-' అని తన బిడ్డలను రాముని ప్రజాశికకు అంకితం చేసి ఆరాధించిన చిత్రమైన ఆరాధనామూర్తి సుమిత్ర.

అలాగే-సీత రామునిలో భర్తనూ, దేవుడినీ కూడా చూచింది. సీత ఆరాధన లోని లోతులను చూడడానికి తపస్సు కావాలి. పైపైన చూస్తే, 'వీరేమి సుఖపడ్డారు. అన్న ప్రశ్న మిగులుతుంది దానికి సూటిప్రశ్న సుఖమనగా నేమి ? జవాబు కష్టము. కాని మనిషి యొక్క మానసిక స్థితినిబట్టి సుఖంలోని అర్థం మారిపోతుంది.

ఎవరో అడిగాడు రాముడు అన్ని కష్టాలు పడ్డాడు. అది ఏ పూర్వ ఫలము ? అని.

అవతారమూర్తికి పూర్వ కర్మము ఉండదు. మానవజాతి చేసిన మొత్తము కర్మము. అతడు దిగిరావడానికి కావలసిన పూర్వకర్మము. ఆ పూర్వ కర్మమును తనదిగా మలచుకొని, మొత్తం మానవజాతి ఎడల బాధ్యతపడిన వానిని అవతార మూర్తి అంటారు. బాధ్యత పడడంలో అతనికి సుఖమున్నది. మనం అనుకునే సుఖానికి అక్కడ అవకాశం ఉండదు.

రామకృష్ణ పరమహంసకు కొన్సరు వచ్చినా అంతే. రమణ మహర్షికి కాన్సరు వచ్చినా అంతే. ఏసుప్రభువును శిలువ కొట్టినా అంతే. శ్రీ కృష్ణుని వెనుక మృత్యువు పొంచి ఉన్నా అంతే. రాముడు అడవుల పాలయినా అంతే. వారికి సొంత కథలు ఉండవు. సృష్టికథయే సొంత కథగా జవాబు చెప్పుతున్న అవతారమూర్తులు వారు. 'అప్పుడు జరగవలసిన సృష్టి కథకు' ధర్మ సంస్థాపన కార్య క్రమానికి ఏవేవి అవసరమో వాటి కొరకు అవతారమూర్తులుగా దిగుతారు. వారికి పూర్వకర్మము ఉన్నదా ? అనరాదు. ఇక సుఖమా ? తాము అనుష్ఠించవలసిన కార్యక్రమంలో, బాధ్యతలో వారికి సుఖం ఉన్నది.

కనుక-మన కళ్లకోళ్లలో నుంచి సీతారాములను చూడరాదు. సీతను రాముడు ఆరాధించాడు. సీత రాముడిని ఆరాధించింది. కనుకనే ఒకే ధర్మ సంస్థాపన కార్యక్రమంలో ఇద్దరూ సమానమైన పాత్రను పోషించారు ఆవిడ శత్రువును కోరి వెళ్ళినది. ఆయన శత్రువును వధించినాడు. సామాన్యంగా కథ రాముని చుట్టూ తిరుగుతుంది. రాక్షసవధ మొత్తం సీత చుట్టూ తిరుగుతుంది. రావణ వధతో కథ పూర్తయింది.

కనుక, మాకు అన్నీ తెచ్చి ఇంట్లో పడేయండి. మేము వండి పెడతాం, అనే మామూలు గృహిణిగా కాక నీ జీవితమే నా జీవితం. నా జీవితమే నీ జీవితం. కర్తవ్యాలు మన ఇద్దరికీ కలసి ఒక్కటే. రెండు కర్తవ్యములు లేవు' అన్నది సీత. ఒకే కర్తవ్యానికి రెండు ముఖాలుగాపని చేసిన సీతారాములకన్న ధన్యులెవరు? ఇద్దరు కలసి ఒక్కటై ధర్మ సంస్థాపన చేశారు. మరి చివరకు విడిపోయారు కదండీ అని అనరాదు. మానవజాతి ధర్మాన నిబడతం కోసం మేము విడిపోయినా ఫరవాలేదు. ఆత్మపరంగా మేము ఎప్పుడూ కలిసే ఉన్నాము. అని అన్నారు. ఈ భూమి మీదకు దిగి వచ్చింది మీలో ధర్మ సంస్థాపనకు కనుక 'మీ కొరకు అరణ్యాల పాలు అవుతాం. రాక్షసుల పాలు అవుతాం. వియోగభారాన్ని అనుభవిస్తాం. మాకు

కావలసింది ధర్మ సంస్థాపనం. మాకు కావలసింది రామరాజ్యం.' అన్న సీత యొక్క ఆరాధన రాముడిని కుదిపి వేసింది.

ఇలా ఒక్కొక్కరు ఆ రాముడిని ఆరాధిస్తూ ఉంటే ఏమి తెలుస్తున్నది? వీరి ఆరాధనకు బంధుత్వము సహకరించింది.

ఇక లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు. లక్ష్మణుడు తోడునీడ అయి సేవించినవాడు. భరతుడు రాముని ప్రతినిధి అయి, నిరంతర రామస్మరణలో రామ రాజ్యాన్ని పాలించడంలో ఆరాధించినవాడు. రాముడిని లక్ష్మణుడు సేవించిన విధంగా భరతుడిని సేవించి ఆరాధించిన వాడు శత్రుఘ్నుడు. అన్నదమ్ములందరూ ఆ రామ రాజ్యంలో లగ్నమైపోయారు. అందరూ కలసి ఒకే ధర్మానికి నిల బడ్డారు. మా అన్నయ్య ధర్మమూర్తి అని గుర్తించి నిలబడ్డారు.

అంటే అర్థమేమిటి? నీకు కావలసిన రూపంలో భగవంతుడు నీ దగ్గరకు నడచివస్తూ ఉంటాడు. గురువుగానో, అన్నగానో, బంధువుగానో, పుత్రుడుగానో, సంబంధం పెట్టుకుంటాడు. చిత్రమేమంటే బంధుత్వంలో నీవా విషయాన్ని మరచి పోవచ్చు. వారు మరచిపోరు. దశరథుడు, కౌసల్య, సుమిత్ర మరచిపోలేదు. కైకేయి మరచిపోయి బుద్ధి తెచ్చుకున్నది. లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, సీత, మరచిపోలేదు.

మన బంధువులుగా ఉన్న వారిలో కూడ ఎవరో ఉంటారు. ఎన్నో దైవ-లక్షణాలు ఉంటాయి. కాని, ఆ బంధుత్వం డామినేట్ చేయగా, ఆ లక్షణములను మనం పట్టించుకోము. కనుక ఓ మానవులారా! గృహస్థ జీవితంలో బంధుత్వం పేరిట దైవం మనతో సంబంధం కుదుర్చుకున్న వేళలలో, మనవాడే కదా అని లక్షణాన్ని గుర్తించకుండా ఉండిపోతాం. ఆ ఏమరుపాటు కల్గకుండా, ఆ లక్ష్మణుడు, కౌసల్య, సుమిత్ర, భరత శత్రుఘ్నులు, సీత ఆయనను అర్చించుకొని ధన్యులైనారు.

మనలో ఉన్న విశేషం ఏమంటే ఎదురుగా ఉంటే అర్చించుకునే భావన పోతుంది. కనబడకపోతే దేవుడున్నాడా? అని ప్రశ్నిస్తాం. కనిపించితే మనిషే కదా అని ఏమరుపాటు చెందుతాం.

ఆ ఏమరుపాటు లేకుండా ఆరాధించడం లక్ష్యం! అది చూపించడం కోసమే అత్రి అనసూయల కథ వర్ణించాడు రామాయణంలో. అత్రి అనసూయను ఆరా ధించాడు. అనసూయ అత్రిని ఆరాధించింది. ఆ భార్యభర్తలు ఒకరినొకరు దైవ

స్వరూపములుగా భావించి తరించారు. అందుకే అక్కడికి సీతారాములు వెళ్లినప్పుడు రాముడంటాడు వృద్ధులైన ఈ దంపతులను చూశావా ? మానవ జాతిలోని సకల దంపతులకు ఆదర్శం వీరు. ఒకరికొకరు అంకితమై, దేవతలకు సైతం ఆరాధ్యులైన పూజ్యులు వీరు.

ఇక ఈ ఆరాధనా వైఖరులలో రెండవ అధ్యాయం. ఆ తెగకు చెందిన వారిలో మొదటి వాడు గుహుడు.

రామచంద్రుడు అడవికి వెళ్ళిపోతున్నాడు. మన రాజ్యంలోంచి వెళ్ళిపోతున్నాడు అని తెలిసిన నిషాదరాజు గుహుడు గబగబా ఎదురుగా పరుగెత్తుకొని వచ్చి, మా స్వాగత సత్కారాలు స్వీకరించాలి రామా! మన స్నేహం ఈనాటిదా ? నా ఆరాధన ఈనాటిదా ? అన్నాడు. కానుకలు, ఆహార పదార్థాలు పట్టుకు వచ్చి ఇచ్చాడు.

రాముడన్నాడు 'నీవు ఇన్ని కానుకలు తెచ్చావు. తీసుకోడానికి ఇప్పుడు నేను రాజును కాను. కందమూలములు తినవలసిన తపశ్చర్యలో ఉన్నవాడిని. ఇందులో రాజుగారికి సంబంధించినవి ఒక గుర్రాలే. కనుక, రాచమర్యాదలు ఈ గుర్రాలకే చేయాలి' అని సీతారాములు అక్కడే నిద్రపోయారు. లక్ష్మణుడు మేలుకొని కాస్తున్నాడు. సుమంత్రుడు, గుహుడు మేలుకుని కూర్చున్నారు. అలసిపోయావు. నీవు కాస్త పడుకోవయ్యా అని గుహుడు లక్ష్మణునితో అన్నాడు. 'అది తప్పు. ఒకడు ఉన్నాడు కదా అని మన కర్తవ్యాన్ని మానకూడదు. నీవు కూడా ఉన్నది ఎందుకంటే కబుర్లు చెప్పుకోవడానికి. వారు కబుర్లు చెప్పుకున్నారు. గుహుడా, మా నాన్నగారు ఇలా కామాతురుడై, దయనీయస్థితిలో మా అన్నయ్యను అరణ్యాలకు పంపవలసి వచ్చింది. నిజానికది ఆయనకు ఇష్టమా? ఎంత కష్టమో? ఆయన ఎలా ఉన్నాడో! మా అన్నయ్య లేకుండా క్షణమైన జీవించలేడు అంటున్నాడు లక్ష్మణుడు. ఆ కబుర్లలో రాత్రంతా గడిపేశారు వాళ్ళు.

మరునాడు గుహుడు నదిని దాటడానికి నావను సిద్ధంచేసి నీ పాదాలు సోకితే రాయి కాస్తా నాతి అయిందట. నా పడవ ఏమౌతుందో అంటూ ఆ పాదాలు కడిగాడు.

రాముని దగ్గర ఒక విశిష్టత వున్నది. ఆయన పదవిని బట్టి ఎవరూ ఆయనను గౌరవించలేదు. ఆయన హోదాను బట్టి, వయస్సుని బట్టి, ఎవరూ ఆయనను

గౌరవించలేదు. ఆయనలోని ధర్మబుద్ధిని బట్టి ఆయనను గౌరవిస్తూ వచ్చారు. మానవునికి నిజముగా ఉన్నతిని ఇచ్చేది అతడి పదవులు, సంపద కాదు. అతని ప్రవర్తనే అతనికి ఉన్నతిని ఇచ్చేది. రాముడు దానిని సంస్థాపన చేశాడు. కాబట్టే అందరూ ఆయనను చూసి, మురిసి, పరవశించి వెళ్లారు.

రాక్షసవధలు జరిగి జరిగి, సీతాదేవిని రావణుడు ఎత్తుకు వెళ్లాక, రామ-లక్ష్మణులు కబంధుని ఆశ్రయంలోకి వెళ్ళినప్పుడు చాలా మంచిపని చేశావు రామా! శాప విమోచనం చేసి నన్ను రక్షించావు, నేను నీకొక సాయం చేస్తాను. సీతాదేవిని వెదకి పెట్టగలిగినవారు ఇక్కడ ఋష్యమూక పర్వతం మీద ఉన్నారు. వారితో నీవు చేయి కలుపు. వారికొరకు వెళ్ళే దారిలో ఒక ముసలి నీ కొరకు కనిపెట్టుకొని ఉన్నది. ఆమెను చూచి, ఆ పైన సుగ్రీవుని వద్దకు వెళ్ళు అన్నాడు కబంధుడు.

ఆ దారివెంట నడచివస్తున్నారు వాళ్ళు. అక్కడ ఒక ఆశ్రమం ఉన్నది. వాడని పువ్వులు, పండ్లు, విరగకాచిన చెట్లు. ఆ పవిత్ర వాతావరణంలో మోడు వారిన చెట్టుకొమ్మన ఎక్కడో చివర ఒక పూలగుత్తి ఉంటే ఎలా ఉంటుందో కృశించిపోయిన దేహంతో నెత్తిన ఒక పూలసజ్జ పెట్టుకున్న శబరి అలా కనబడింది.

'నీ కొరకు కళ్లలో ప్రాణాలు పెట్టుకుని ఎదురు చూస్తున్నాను. మతంగ మహర్షి నాకు గురువులు. వారి సేవలో నా శరీరం పవిత్రం అయింది. వారు విమానంలో పై లోకాలకు వెళ్ళిపోతూ, శబరీ! నీ సేవ చాలా ఉత్తమమైనది. చిత్రకూటంలో శ్రీరామచంద్రుడు ఉన్నాడు. అతడు ఇటువైపు వస్తాడు. నిన్ను స్పృశిస్తాడు. నీ ఆతిథ్యం స్వీకరిస్తాడు. అప్పటి వరకూ ఉండి, ఆ పైన ఈ శరీరాన్ని విడిచి పెట్టవలసినది అని చెప్పి వెళ్ళారు. రామా! గురు సేవకు ఫలంగా నీ దర్శనం నాకు లభించింది. నీ రాకకోసం ఈ ప్రాణాలు పొదివి అట్టిపెట్టుకుని ఎదురు చూస్తున్నాయి. మా గురువు చెప్పినప్పటి నుండి మంచివని అనిపించిన పువ్వునల్లా తెచ్చిపెట్టాను నీ కోసం. మంచిగా ఉన్నవనిపించిన పండునల్లా తెచ్చి ఉంచాను నీ కోసం. ఆ పుష్పాలు, ఆ పండ్లు నా ఆతిథ్యంగా నీవు స్వీకరిస్తే....'

ఆదే రామచంద్రుడంటే ఎంత దుఃఖంలో ఉన్నా, ఆ శబరి ప్రేమకు కరిగి పోయి 'అంతకంటే ఏం కావాలి' అని ఆవిడ ఆతిథ్యాన్ని స్వీకరించాడు.

'ఎన్నాళ్లయిపోయిందో' రామా! నీవు అన్నం తిన్నావా ? అని ఎవరైనా అడిగి. అయోధ్యలో కౌసల్య అడిగి ఉంటుంది. బంగారు లేడి కనబడక ముందు సీత అడిగి ఉంటుంది. లక్ష్మణుడికి నీవు మూర్ఛపోతుంటే సపర్యలు చేయడమే సరిపోయి ఉంటుంది నాన్నా! ఈ పండు తినవా!'

ఆరాధనా వైఖరిలో ఒక గుహుడు నదిని దాటడానికి నావను పట్టుకు వచ్చాడు. 'నాన్నా! నీకు పట్టకపోవచ్చు గానీ నీ ఆకలి ఈ అవ్వకు పట్టదా ? కాస్త తిను నాన్నా!'

అంటే అర్థం ఏమిటి ? ఇప్పుడు కావలసినవి నమస్కారములు కావు. సత్కా-రాలు కావు. 'ఎన్నాళ్లయిందో తండ్రీ! ఇవి స్వీకరించు.'

ఆమె కొరకు స్వీకరించాడు. నిజానికి తనకు కావలసి తినలేదు. అప్పుడామె అన్నది. గురువులు చెప్పిన ప్రకారం నీ దర్శనం అయింది. నీకు ఆతిథ్యం ఇచ్చే అదృష్టం నాకు పట్టింది. నీవు సాగనంపితే నీ చేతులమీదగా వెళ్లిపోదామను-కుంటున్నాను నాన్నా!'

అలాగే అమ్మా-అన్నాడు రాముడు.

అక్కడికక్కడే ఆయన చేతులమీదగా ప్రాణాలు విడిచింది.

ఇది ఒక ఆరాధన వైఖరి.

రామ లక్ష్మణులు ఋష్యమూక పర్వతాన్ని సమీపిస్తున్నారు. వారి దగ్గరకు తేజోమయమైన, విలక్షణమైన మూర్తి ఒకరు నడచి వస్తున్నారు. 'మహనీయుల రాకతో మా ప్రాంతం పావనమైంది. నన్ను హనుమంతుడంటారు. సుగ్రీవుని మంత్రిని. అతడు మహాబలవంతుడు. మీకు మేలు చేయగలిగినవాడు. కాలం కలిసివస్తుందని ఎదురు చూస్తున్నవాడు. మరి మీరో ? మీ గురించి కూడా కొంచెం చెబితే బాగుంటుంది కదా.

లక్ష్మణుడు రామునివైపు చూశాడు. రాముడు చెప్పమన్నాడు. లక్ష్మణుడు తగు మాత్రం చెప్పాడు.

ఇద్దరినీ చెరొక వైపునా ఎత్తుకుని వెళ్ళిపోతున్నాడు హనుమ. ఆ రామ లక్ష్మణులిద్దరూ చెప్పుకుంటున్నారు.

'హనుమంతుడు ఎంత చక్కగా మాట్లాడాడు', అతని మాటలు ఎంత ఆర్ద్రత కలిగి ఉన్నాయి! అవి అతని హృదయంలో నుండి వచ్చాయి. ఎంత స్పష్టత కలిగి ఉన్నాయి? ఎంత పండితుడతడు! వేదములచే పునీతమైన సంస్కారము. వ్యాకరణముతో సంస్కరింపబడిన వాక్కు. ప్రేమతో పునీతమైన భావము.

అతడు సుగ్రీవుడి దగ్గరకు తీసుకువెళ్ళాడు. వారిద్దరికి మైత్రి కుదిర్చాడు. నిలబడి ఉన్నాడు. రాముడు ఆంజనేయుడిని చూశాడు.

'నిజంగా నీవు ధన్యుడవయ్యా! రాజును మించిన వాడివి, అయినా రాజు దగ్గర ఆ వినయం, ఆ విధేయత, ఆ పొందిక తెలిసిన వాడివి. మంత్రి అంటే ఇలా ఉండాలి. బంటు ఇలా ఉండాలి. శ్రేయస్సు కోరేవాడు ఇలా ఉండాలి' అనుకొంటున్న రాముని గుండెలకు హనుమంతుని ప్రవర్తన దగ్గరయింది.

రాముని సహకారం పూర్తయింది. కాని సుగ్రీవుడు మరచాడు. అయితే, గుర్తుచేయబడ్డ తర్వాత చక్కగా తన బాధ్యతను నిర్వర్తించాడు. అంతవరకు సుగ్రీవుడు ధన్యుడు. సుగ్రీవుడు మంచి ఎగ్జిక్యూటివ్. సర్వసమర్థుడు. వానరు-లందరిచేత అన్వేషణ చేయించినవాడు.

ఆ సీతాన్వేషణలో ఆంజనేయుని పాత్ర చూద్దాం. సముద్రాన్ని దాటే వేళ మైనాకుడు పైకి వచ్చి, 'విశ్రాంతి తీసుకో. నా ఆతిథ్యం తీసుకో' అంటే 'అందుకు ఇది సమయం కాదు. నేను రామ కార్యంమీద వెళుతున్నాను. రామ బాణం వలె వెళ్ళవలసి ఉన్నది'. అన్న హనుమంతుడు మనకు ఆదర్శం.

చిత్రమేమంటే-హనుమంతుని జీవితంలో స్వామి కార్యం తప్ప స్వకార్యం అంటూ లేదు. అతడు ఆదర్శప్రాయుడు. అందువల్లనే సీతను చూడగలిగాడు. సీతారాములను ఒకచోటికి తీసుకురాగలిగాడు.

నిజానికి మనమందరం చేస్తున్నది ఈ సృష్టిపనే. కానీ మనము దానిని స్వంతపనిగా భ్రమపడుతున్నాము. మనం చేసే ప్రతి చిన్న, పెద్ద పని ఈ భూమి పైన మనకు అప్పగించబడిన పవిత్ర కర్తవ్యంగా, స్వామి కార్యంగా గుర్తించుకుంటే, స్వకార్యము అనే భ్రమ తీరిపోతుంది. మన ఉద్యోగాలు, పెళ్లిళ్లు, పిల్లలు, వారి చదువులు సమస్తమూ స్వామి కార్యమే. నిజమునకు స్వకార్యమన్నది లేదు.

హనుమంతుని సందేశం ఏమంటే, స్వామి కార్యం తప్ప స్వకార్యమన్నది నీ భ్రమ!

ఆ కారణంచేతనే శ్రీరామచంద్రుడు తన మందిరానికి ఎదురుగా ఆంజనేయుడి మందిరాన్ని పెట్టుకున్నాడు.

'ఈ పనులు నావికావు. నీవు అప్పగించిన పనులు. నీవు అప్పగించిన పనుల కోసం నిన్ను ప్రార్థిస్తున్నాను. ఈ జీవితం స్వామి కార్యం' అనే దర్శనాన్ని మనకు ఆంజనేయుడు కలిగిస్తాడు. అలాంటి భావంతో జీవించినప్పుడు మనం సీతాదేవిని చూడగలుగుతాము. సీతా-రాములను ఒక చోటికి తీసుకురాగలుగుతాము. మన దేహంలోనే అమ్మవారు అయ్యవారు ఒక చోటికి వచ్చి మాట్లాడుకుంటారు. ఈ జీవితమే ఒక రామ కళ్యాణం అవుతుంది.

దానికి బాటలు వేసిన, సుందర కాండ స్వరూపుడైన ఆంజనేయుని ఆరాధనా వైఖరి విశిష్టము సకలపూజ్యము. ఇలా రామాయణంలోని ఆరాధనా వైఖరుల రూపం ఏమంటే-ఈ జీవితంలోని సకల సన్నివేశములు స్వామి కార్యంలోని భాగములే.

ఆదిశంకరులు చెప్పినట్లు- నేను మాట్లాడే ప్రతి మాటా, తల్లీ! నీ నామ మంత్రం కావాలి, నేను వేసే ప్రతి అడుగు నీకొరకు ప్రదక్షిణం కావాలి.

అలా మన జీవితాలు వర్ధిల్లాలి.



# శత్రుత్వమునకు పరిష్కారం

రామాయణంలో శత్రుత్వానికి పరిష్కారం ఎలా చూపబడింది ?

మొదటిది వాలి వధ ఘట్టం. శ్రీరామచంద్రుడు సుగ్రీవునికి అభయం ఇచ్చాడు. ఆ ప్రకారం-వాలి సుగ్రీవులు యుద్ధం చేస్తుండగా, ఒకే ఒక బాణంతో వాలిని పడగొట్టాడు. ఆ బాణం అతడి ఆయువు పట్టులో దిగింది. అతనికి మూర్ఛ వచ్చినట్లయింది. శక్తి సన్నగిల్లుతున్నది. కళ్ల ఎదుట ఉన్న రాముని నిలదీశాడు వాలి.

'మా అన్నదమ్ములిద్దరి మధ్య నీకేమిటి సంబంధం? మేమిద్దరం కొట్టుకుంటూ ఉంటే చాటుగా దెబ్బ తీస్తావా ? ఇదేనా ధర్మం ? నీవు లౌక్యుడివి కూడా కావు. నాచేత దెబ్బలు తిని ఎక్కడో దాగుకొని ఉన్న సుగ్రీవుడిని నీవు సాయం అడగటమేమిటి ? నాదగ్గరకు వస్తే, తృటికాలంలో రావణుణ్ణి పడగొట్టి సీతను ఇక్కడ నిలపెట్టేవాడిని'

మూలుగుతున్న వాలితో రాముడు ఒక మాట అన్నాడు.

'నీ వెవరివి కొట్టడానికి అనేమాట నీవు అనడానికి వీలులేదు. ఎందుకంటే ఇది ఇక్ష్వాకుల రాజ్యంలో భాగం. ఇందులో ఎక్కడ అధర్మం జరిగినా, శిక్షించవలసిన బాధ్యత రాజుది. ఇప్పుడు రాజు భరతుడు. అతడి ప్రతినిధిగా నాకు అధర్మాన్ని శిక్షించేందుకు అన్నివిధాల అధికారం ఉన్నది.'

'ఇక నీ రెండవ ప్రశ్న. నాకు కావలసింది బలవంతుడయితే, నేను నీ దగ్గరకు వచ్చేవాణ్ణి. నాకు కావలసింది. ధర్మపరుడు కనుక, ధర్మము సుగ్రీవుని పక్షాన ఉన్నది. గనుక, నేను అతడి పక్షాన నిలిచాను. నీవు అధర్మపరుడవు కనుక నిన్ను పడగొట్టాను.

'నీవు చేసిన అధర్మం ఏమిటో చెపుతాను. నీవు గుహలో సంవత్సరాల తరబడి మాయావితో పోరాడావు. గుహలోనుంచి రక్త ప్రవాహం బయటకు వస్తుంటే, వానరులంతా నీవు మరణించావని భావించి తిరిగి వచ్చారు. అందరి సలహా సంప్రదింపులతో సుగ్రీవుడు వానర రాజ్యానికి రాజయ్యాడు. నీ భార్య అయిన తార పట్టమహిషి పదవికోసం అతడిని చేపట్టింది. అతడు రాజ్యం ఏలుతున్నాడు. నీవు బ్రతికే ఉన్నావు. బయటకు వచ్చావు. నీవు వస్తే నీ తమ్ముడు రాజ్యం ఇవ్వనంటాడా ? వనుక నీ రాజ్యాన్ని నీవు స్వీకరించి, నీ తమ్ముణ్ణి నీతో సమానంగా చూస్తే ఎంత బాగుండేది ? అలా చేయకుండా నీ తమ్ముణ్ణి శత్రువుగా పరిగణించి, వాడిని ఉతగ్గొట్టి రాజ్యం నుండి వెడలగొట్టి, అతడి భార్య అయిన రమను బలత్కారించి తెచ్చి నీ ఇంట పెట్టుకున్నావు. నీ రాజ్యాన్ని నీవు కోరటంలో తప్పులేదు. కాని నీ తమ్ముణ్ణి నిలువ నీడ లేకుండా చేయటం తప్పు. వెదికి వెదికి కొట్టడం ఇంకా తప్పు. ఋష్యమూక పర్వతం పైన తలదాచుకున్న స్థితిలో అతడికి తోడుగా ఉండవలసిన అతడి భార్యను నీవు తెచ్చుకోవడం తప్పు. నీ భార్యను నీ తమ్ముడు స్వీకరించడం నీకు కష్టమనిపించినా ఆమె మీ యిద్దరకు దేవతలచేత ఈయబడిన ఉమ్మడిభార్యకదా!

'మూడవది. చాటునఉండి కొట్టవచ్చునా అని అడిగావు. మానవుల సంగతి అటుంచు. కనీసం వానరుడిగా అయినా నీవు సంచరించలేదు. అంతకన్న హీనమైన పాశవిక ప్రవృత్తిలో మునిగి నీవు వ్యసనములకు బానిసవై మదాంధుడవై ఉన్నప్పుడు వేటగాడు జంతువులను తరిమి చంపినట్లు నిన్ను చంపవలసిన బాధ్యత రాజుపై ఉన్నది. పశువువలె సంచరిస్తున్న నిన్ను ఆ వేటగాడి ధర్మంలో చంపవలసి వచ్చింది.'

'నేను చెప్పినదానికి నీ జవాబు ఏమిటి ?'

ఆ ప్రశ్న విన్న వాలి ఆలోచనలో పడ్డాడు. కాసేపు అలా ఆలోచనలో ఉండి, ఒక్కసారి 'రామా ఇటురా' అన్నాడు.

ఈ సంఘటనలో వున్న ఆర్ద్రతను అర్థంచేసుకోవలసి ఉంది.

వాలి అంటున్నాడు.

'నాలో ఇప్పుడిప్పుడే కొంచెం ధర్మం మేలుకొంటున్నది. నేను నిన్ను నిందిస్తున్నప్పుడు అవన్నీ నాకు పాయింట్లుగానే కనపడ్డాయి. కాని - నీవు నాకు వివరిస్తున్నప్పుడు నాలోని మూలాలు కదిలిపోయాయి. నిజమే ఈ రాజ్యం నీది. ఈ

రాజ్యంలోని వారిని శిక్షించే అధికారం నీకున్నది. తమ్ముణ్ణి అంత శత్రువుగా చూడ వలసిన పని లేదు. భ్రాంతిమించి నేనే వాడిని శత్రువుగా చేశాను. దిక్కులేని వాడికి భార్యకూడా లేకుండా చేశాను. నీవు అంటే గుర్తుకు వచ్చింది. నేను, నిజంగానే పశువునై ప్రవర్తించాను. కనుక రామా! నీ ప్రవర్తన సరైనదని నేను అంటున్నాను. నీవు నన్ను కొట్టడం ధర్మమే అంటున్నాను. నేను నీకు చిత్తశుద్ధితో నమస్కారం చేస్తున్నాను'.

ఇది వాల్మీకి రామాయణంలో అక్షరాలా ఉన్నది.

'నా తప్పు నాకు తెలిసింది' అనేటప్పటికి అతడికి మూర్ఛవచ్చింది. తార అక్కడికి చేరి దుఃఖిస్తున్నది. అప్పుడు హనుమంతుడు కలుగజేసుకొని అన్నాడు. 'అమ్మా పుట్టిన ప్రతి వ్యక్తి వెళ్లిపోక తప్పదు. ఇతడు వెళ్లపోతున్నాడు. ఇక జరగ వలసింది చూడు'.

ఈలోపల వాలికి స్పృహవచ్చింది. అతడు సుగ్రీవుడిని దగ్గరకు పిలిచి ఇలా అన్నాడు.

'తమ్ముడూ, నిన్ను నిజంగా తమ్ముడూ! అని ఇవాళ పిలుస్తున్నాను. ఈ రాజ్యాన్ని నీవు పరిపాలించు. ఈ అంగదుణ్ణి నీ పిల్లవానిగా చూసుకో. ఈ తారను కనిపెట్టుకొని ఉండు. ఈమె దగ్గర ఒక చిత్రమైన ప్రజ్ఞ ఉన్నది. ఆమె ఏది అంటే అది నిజమవుతుంది. ఈమెను కొంచెం పూజ్యభావంతో చూసుకో.

'నాన్నా, ఒక్కమాట. రాముడికి ఇచ్చిన మాట మీద నిలబడు. సర్వశక్తులా ఒడ్డి సీతాదేవిని వెదికిపెట్టు. రాముడి యెడల మరొక విధంగా ప్రవర్తించకు. ధర్మం తప్పిన వేళ రాముడికి నేనెంతో నీవూ అంతే.

ఇది వాలి చెప్పిన చివరి మాట. రాముడంటే ఏమిటో అతనికి అర్థమై పోయింది. రాముని స్నేహము ధర్మంతో రాముని శతృత్వం అధర్మంతో. రాముని మాటలు శ్రద్ధగా విన్న వాలికి అక్షణంలోనే జ్ఞానోదయం అయింది. అతడు 'రియాక్ట్' అయ్యేటటువంటి 'రియలైజ్' అయ్యాడు. రామా, నీవు చెప్పింది నిజం - అని చెప్పగల ధీరత్వం అతనికి ఉన్నది. నేను చేసింది తప్పు అని ఒప్పుకోవడానికి చాలా గుండె ధైర్యం కావాలి. దానిని వాలి ప్రదర్శించాడు.

రాముడు సంతోషించాడు. 'తమ్ముడు అన్నను గౌరవించాలి. తమ్ముణ్ణి అన్న బిడ్డగా చూడాలి. ఇది మన సంప్రదాయం. ఇప్పుడు మీరు ఆ స్థితికి వచ్చినందుకు, మాయింట ఉన్న వాతావరణం మీ ఇంటకూడా ఉన్నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది. వాలీ ఒక మాట. రాజదండన పొందిన వారికి యమదండన ఉండదు. నీవు చేసిన అధర్మానికి ఇక్కడే నీవు రాముని చేతిలో దండన పొందావు. ఇక్కడే నీకు జ్ఞానోదయం అయింది. అంతేకాదు. కర్తవ్యాన్ని గ్రహించి నిర్వర్తించగలిగావు. ఓ పుణ్యాత్మా ! నీవిక పుణ్యలోకాలకు ప్రయాణం కావలసింది' అన్నాడు.

రాముడు ఆ మాట అనగానే వాలి తనువు చాలించాడు.

ఇది పరమ పుణ్యప్రదమైన ఘట్టం. వాలికి అంత గర్వమూ పోయి, జ్ఞానోదయం అయిన ఘట్టం.

భారతంలో యుద్ధరంగంలో పడిపోయిన వాడిని నిలబెట్టడానికి భగవద్గీత అవసరమయింది. 'నష్టో మోహః స్మృతిర్ లబ్ధా' ఇదిగో నా మోహం వీడుతున్నది. నేను ధనుర్ధారిని అవుతున్నాను. అన్న అర్జునుడు కనబడతాడు. 'ఇదిగో వాలీ, నీవు చేసిన తప్పు ఇదీ' అంటే నా తప్పును గ్రహించాను అన్న వాలి కనబడతాడు రామాయణంలో.

అప్పుడు రాముడు ఒక పని చేశాడు. రామునికి సుగ్రీవుడూ తెలుసు, వాలీ తెలుసు. ఈ సందర్భంలో వాలిది తప్పే కావచ్చు. సుగ్రీవుని పట్ల ధర్మం ఉండవచ్చు. రాబోయే సన్నివేశాలలో సుగ్రీవుడు ఎలా ప్రవర్తిస్తాడో ఎవరికి తెలుసు ? అందుకని అంగదుడికి పట్టాభిషేకం జరిపించాడు. సుగ్రీవుడిని గార్డియన్‌గా ఏర్పాటు చేశాడు.

శత్రుత్వానికి పరిష్కారం ఏమిటో రావణాసుర ఘట్టంలోనూ కనబడుతుంది. అంతకుముందు దండకారణ్యంలో రాక్షసులు వస్తున్నారు. చంపబడుతున్నారు. వీరంతా రావణుని మనుషులే. విశ్వామిత్రుని యాగంలో వచ్చిన మారీచ సుబాహులు రావణాసురుని మనుషులే. ఆ మనుషులంతా అయిపోయిన తరువాత అసలైనవాడిని రాముడు సమీపించిన వేళ - ఇతడికి శిక్ష ఏమి ? ఇతడికి పరిష్కారమేమి ? ఇతడికి ఎవరెవరు ఏమేమి చెప్పినారు ? ఇతడు గ్రహించినాడా లేదా - ఇది మనం గ్రహించవలసినది.

ఈ శత్రువునకు మొట్టమొదట దడుపు చెప్పినవాడు హనుమంతుడు. సీతా దేవిని చూడటానికి వెళ్ళిన హనుమంతుడు కావాలని పట్టుబడి, రావణుని సభలో అతడిని హెచ్చరిస్తూ ఒక మాట చెప్పాడు.

'ఏ వాలి చేతిలో నీవు వాలిపోయి నోరిపడిపోయావో ఆ వాలిని వధించిన రాముడు మానవమాత్రుడు అని అనుకోవడం నీ బుద్ధిమాంద్యం. రెండవది. దండ కారణ్యానికి నీవు దండుగా పంపిన రాక్షసులలో ఏ ఒక్కడూ నీవద్దకు తిరిగి రాలేదు. భూమిమీద ఉన్న రాక్షస పీడను రాముడు విరగడ చేశాడు. వానరులలో ఉన్న అధర్మ పరుడైన వాలినికూడ రాముడు వధించాడు. ఇక అధర్మపరులలో నీవు మిగిలావు. ఇప్పుడు నీవంతు వచ్చింది. నీవు మంచిగా నడుచుకున్నావా ! ఉండిపోతావు. లేదా ? వెళ్ళిపోతావు.

'వెంటనే వీణ్ణి చంపేయండి' అన్నాడు రావణుడు.

రావణునిదగ్గర ఒక లక్షణం ఉన్నది. తన తప్పు ఎవరైనా వ్రేలెత్తి చూపితే అతడు భరించలేడు. కనుక ఆ వచ్చినవాడు దూత అన్న విషయం కూడ మరచిపోయి - 'వీడిని హతమార్చండి' అన్నాడు.

'అన్నా, ఆగు' - అన్నాడు విభీషణుడు. దూతలను హతమార్చడం తప్పు - అన్నాడు.

ఇపుడు ఇదొక అడ్డమా, ఇదొక అపశకునమా -అన్నట్లు చూశాడు రావణుడు నీవు ఉండడం చాలా ఇబ్బందిగా ఉంది. ప్రతిదానికీ అడ్డాలు పెడతావు నీవు—అన్నట్లు చూశాడు రావణుడు.

ఆ తర్వాత, యుద్ధానికి సిద్ధపడ్డ తర్వాత అంగదుడు రాయబారానికి వచ్చాడు. అంగదుడిని రావణుడు కుదిపి చూశాడు. అంగదుడంటే కొంచెం భయం వేసింది అతడికి. లెక్క ప్రకారం అంగదుడు రాకూడదు. వాలిని రాముడు వధించాడు. అటు వంటి వాలి కొడుకు రాముని పక్షాన పనిచేయడం ఏమిటి? అని రావణుడికి ఆశ్చర్యం బాధ కలిగాయి. అప్పుడు అంగదుడు చెప్పాడు.

'రాముడు ధర్మపరుడు. నా తండ్రిలో వున్న అధర్మాన్ని అతడు శిక్షించాడు తప్ప, నా తండ్రిని శిక్షించాలన్న ఉద్దేశం అతడికి లేదు. ఓ రావణుడా ! ఆ మాట చెప్పడానికే వచ్చాను. నీలో ఉన్న బలహీనతను అధర్మాన్ని శిక్షించడానికి అతడు

వచ్చాడు. తప్పు, నిన్ను శిక్షించడానికిరాలేదు. అతడిలో ఉన్న ధర్మానికి నీవు శరణాగతి చెందు. ఎందుకంటే ఆయన మా నాన్నగారిని వధించడం కళ్లారా చూశాను. మా నాన్నగారితో ఆయన మాట్లాడటం నేను కళ్లారా చూశాను. రాముడంటే ఏమిటో తెలుసుకో, నడుచుకో'.

'ఛీ వానరుడా! సిగ్గు లేదూ నీకు ? నీ తండ్రిని చంపిన వ్యక్తి తరఫున పనిచేస్తూ నీవు నాతే చెప్తున్నావా ?' అన్నాడు రావణుడు.

ఈ లోపల విభీషణుడు అటు ప్రక్కకు చేరుకున్నాడు. శరణాగతి కోరి వచ్చిన విభీషణుడిని చూచి, 'నిన్ను ఇప్పుడే లంకకు రాజుగా అభిషేకిస్తున్నాను'. అన్నాడు రాముడు.

'స్వామీ మీరు కొంచెం తొందర పడుతున్నారు. కొంచెం ఆగండి. విభీషణునివలె రావణుడు కూడా వచ్చి శరణాగతి చెందితే ? అన్నాడు సుగ్రీవుడు.

'అంతగా రావణుడు రావడమే జరిగితే నా అయోధ్యను అతనికి ఇస్తాను. అంతే కాని విభీషణుడికి ఇచ్చిన మాట వెనుకకు తీసుకోను' - అన్నాడు రాముడు.

ఎంత ఆశ్చర్యకరమైన మాట ఇది !

తనను ఇంత ఇబ్బంది పెట్టి, మానసికంగా ఇంతటి శోభకు గురిచేసి, కొండ కోనల మధ్య విలవిలలాడేటట్లు వేడిపించి, అరణ్య ప్రాంతమంతా సీత కోసం రోదిస్తున్నదా అన్నట్లుగా శోకింపజేసిన రావణుని గురించి రాముడు అన్నమాట ఇది.

అంటే రామునికి రావణునితో శత్రుత్వం లేదా ? ఆయన శత్రుత్వం అతడిలో ఉన్న అధర్మంతో కాని వ్యక్తితో కాదు. అధర్మం నుండి బయటపడిన వేళ ఆయనకు సుగ్రీవుడు ఎంతో వాలి అంతే. అధర్మం నుండి బయటపడాలే కాని, ఆయనకు విభీషణుడు ఎంతో రావణుడూ అంతే. ఆ వానరులలో సుగ్రీవుడు బయటపడ్డాడు. వాలి ఆఖరు క్షణాలలో అయినా బయటపడి రాముడికి తృప్తి కలిగించాడు. ఇక్కడ విభీషణుడు బయటపడ్డాడు. ఆ రావణుడు మాత్రం బయటపడడంలేదు.

ఇంకా వెళ్లండి. ఇంకా వెళ్లండి-అంటూ ఎక్కడెక్కడివో సైన్య సమూహాలను పంపిస్తున్నాడు. కుంభకర్ణుణ్ణి కూడా పంపించాడు. చివరికి తానే వస్తున్నాడు. తప్పు-తప్పు ఒప్పుకోవడం లేదు. అందుకే రామ రావణ యుద్ధం జరిగింది.

ఆ యుద్ధంలో రావణుడు అలసిపోవడం చూసి, సారథి రథాన్ని ప్రక్కకు తీసుకుపోయాడు. నాకెంత అవమానం ? నా తల తీసేసినట్లయింది. రాముడు నీకేమైనా లంచం పెట్టాడా ? అన్నాడు రావణుడు. ఆ సారధి అన్నాడు - ప్రభూ మీరెంత అలసిపోయారో మీకు తెలియడం లేదు. గుర్రాలు కూడా అలసిపోయాయి. విశ్రాంతి అవసరం అనిపించి ఇవతలకు తీసుకువచ్చాను. తానెంత అలసిపోయిందీ రావణునికి తెలుసు. వాడికొక దండ నమాకరించి, పదరా మళ్ళీ అన్నాడు.

మళ్ళీ రావణుడు బయలుదేరాడు. యుద్ధంలో రామునికి కొంచెం అలసట వచ్చింది. అగస్త్యుడు దిగివచ్చి ఆదిత్య హృదయాన్ని ఉపదేశించాడు. 'ఆదిత్య హృదయం అంటే సూర్యుడు ఎవరి నుండి వ్యక్తమవుతున్నాడో అట్టి అంతర్యామి స్వరూపం, నారాయణ స్వరూపం. రామా ఏ వెలుగు నుంచి నీవు దిగి వచ్చావో ఆ వెలుగుయొక్క నిజ స్వరూపంలోనికి ప్రవేశించు. అక్కడ అలసట, ఆకలి, దప్పికలు ఉండవు. ఇక విజృంభించు' అన్నాడు.

ఆ ఆదిత్య హృదయంలో నిలబడి శ్రీరామచంద్రుడు యుద్ధం చేస్తున్నాడు. ఇంతలో రావణుడు అలసిపోయాడు. రాముడు అన్నాడు. - 'మీరు అలసిపోయారు. కొంచెం విశ్రాంతి తీసుకునిరండి' అలా అతడు ఆలోచించుకునేందుకు మరొక అవకాశం ఇచ్చాడు. రాముడు తనను అవమానించినట్లు భావించాడు రావణుడు. సిగ్గు పడ్డాడు తప్ప ఆలోచించుకుని 'రియలైజ్' కావడానికి అది ఒక అవకాశంగా భావించ లేదు. విజృంభించాడు. రాముని చేతిలో తెగిపడిపోయాడు.

ఆ తర్వాత మండోదరి వచ్చి విలపించింది. వాలి కథలో తార విలాపాన్ని ఎలా చదువుకోవాలో, రావణ కథలో మండోదరి విలాపాన్ని అలా చదువుకోవాలి.

'మీ ఇంద్రియాలను అదుపులో ఉంచుకొని మీరు ఎంతో తపస్సు చేశారు. ఆ తపస్సు ఫలించింది. ఇంద్రుణ్ణి జయించారు. కైలాసగిరిని ఎత్తారు. శివుణ్ణి మెప్పించారు. వరాలు పొందారు. కానీ, సీతాదేవిని ఏ క్షణంలో కోరారో ఆ క్షణంలో మీ ఇంద్రియాలు అదుపు తప్పాయి. కామమనే బలహీనత నీ తపస్సును, నీ జీవితాన్ని

ఇలా భగ్నం చేసింది. ఓ ప్రభూ ! ఇంద్రియాలను నీ గుప్పిట బంధించినందుకు అవి నీపై ఇలా పగ తీర్చుకుంటున్నాయేమో ! ఎంత చిత్రమైన మాట అది. కావాలని చేసిన తపస్సు అది. జరిగిన తపస్సు కాదది. వరాలకోసం చేసిన తపస్సు అది. ఏదైనా సహజంగా దాని కదిగా రావాలి. అసహజంగా వచ్చినందువల్ల అతడు అంత అసహజంగా పడిపోయాడు.

ఆ మండోదరి విలాపంలో రావణాసురుడికి సందేశం ఉన్నది. బ్రతికి ఉండగా చెపితే అతడు వినడు. రావణాసురుని శవం ప్రక్కన కూర్చొని ఆ మండోదరి పలికినపలుకులు అతడి జీవితంపై ఆమె ఇచ్చిన తీర్పు.

ఆ తర్వాత విభీషణుడు అక్కడికి వచ్చాడు. విలపిస్తూ - 'అన్నా ! ఈ దశ నీకు రాకూడదనే నీకు అంతగా చెప్పాను. ఆనాడు చెపితే నీకు ఎక్కింది కాదు' అంటున్నాడు. ఆ మాట విన్న రాముడు వచ్చి అన్నాడు.

'వైరమన్నది మరణంతో అంతమైపోయింది. ఇక నీవు ఎంతో రావణుడూ అంతే. అతడి నేరానికి శిక్ష అతడు అనుభవించాడు. శిక్షను అనుభవించినవాడిని ద్వేషించేవాడు. పిచ్చివాడు కనుక, అతడు ఊర్ధ్వగతులు పొందేటట్లు తదుపరి కార్యక్రమం జరిపించు. నీ ప్రక్కనే ఉండి నేనుకూడా సహకరిస్తాను.'

శత్రుత్వానికి ఎటువంటి పరిష్కారం ఇందులో ఉన్నది ? ఎటువంటి సమన్వయం ఇందులో ఉన్నది ?

ఒకడు శత్రువు అంటే మనకొక 'ఇంప్రెషన్' పడిపోతుంది. ఒకడు మిత్రుడు అంటే మనకొక 'ఇంప్రెషన్' పడిపోతుంది. అతని మీదనే కాదు.ఆ వంశంమీద, ఆ ఊరుమీద, ఆ 'ఇంప్రెషన్' పడిపోతుంది. ఇలాంటి బలహీనతలను, శత్రుత్వాలను, విద్వేషాలను విశ్లేషించుకుని, ధర్మబద్ధమైన స్థితికి ఎదగవలసి ఉన్నదని మానవులకు ప్రబోధించే దివ్య గ్రంథం రామాయణం. మరణంతో వైరం ముగిసింది అనే మాటలు ఎవరైనా చెప్పవచ్చు. కాని ఆ శత్రువులచేత క్షోభకు గురి చేయబడిన శ్రీరామచంద్రుడు వచ్చి చెప్పడం విశేషం. ఇద్దరు కొట్టుకుంటే మూడవ వ్యక్తి వచ్చి

మరణంతో విద్వేషం పోయింది అని చెప్పవచ్చు. కాని ఆ బాధపడినవాడే ఆ మాట చెప్పడం అతడు ఏ స్థాయికి ఎదిగి ఉన్నాడో చూపే అంశం. అతడు ఏ ఆదిత్య హృదయంలో వసించి ఉండాలో, ఏ ధర్మాన్ని ఈ భూమిమీదకు దింపి ఉండాలో, నిర్వహించి ఉండాలో మనం ఆలోచించాలి.

ఈ ఘట్టములు ఋషిప్రోక్తమైనవి. ఆ వాల్మీకి దర్శించి, అనుభవించి, మనకు అనుగ్రహించిన వాక్యములు ఇవి. ఇవి మనచెవులలో మారుమ్రోగుగాక. మన జీవితములందు పర్యవసించి, మనకు దారి చూపుగాక. మన జీవితములు ధన్యములు అగుగాక.





# జగత్ కళ్యాణం

మనం ప్రతి సంవత్సరం సీతారామ కళ్యాణం ఊరూరా, వాడవాడలా జరుపుతున్నాం. ఆ కళ్యాణంలోని పరమార్థం ఏమిటి ?

జనక మహారాజు భూమిని దున్నుతూ ఉండగా, నాగటి చాలులో సీతాదేవి దొరికింది. సీత అనగా నాగటిచాలు. ఆ నాగటిచాలు భూమి మీద పడేటప్పటికి, దాని కోసం ఆకాశం నుండి ఒక నీలమేఘుడు దిగి వస్తాడు. క్రింద భూమిపై సీత అనే నాగటిచాలు ఉన్నది. దాని కొరకు ఆకాశంలో నీలమేఘుడు రాముడు ఉన్నాడు. ఇద్దరి నడుమ ఇంద్రధనస్సు అనే శివధనుస్సు ఉన్నది. ఆ శివ ధనుస్సును విరిచి, ఆ నాగటి చాలును తనదిగా చేసుకునే రామ స్వరూపం యొక్క కళ్యాణం ప్రతి సంవత్సరం జరుగుతూనే ఉన్నది. నాగటి చాలు కోసం నీలమేఘం దిగివస్తే ఈ భూమిమీద చినుకు పడడం, ఆ నాగటి చాలు నుండి పంట పైకి రావడం ఇది శుభప్రదంగా, ఈ లోకం వర్ధిల్లడం అనే గాథగా ప్రతి సంవత్సరం జరుగుతూనే ఉంటుంది. కనుక సీతారాముల కళ్యాణం మనం ప్రతి సంవత్సరం జరుపుకోవలసిందే. నాగటిచాలు లేకపోతే, నీలమేఘుడు రాకపోతే, ఇంద్రధనుస్సు విరవబడకపోతే రామ కళ్యాణం జరగకపోతే- ఇక ఈ భూమిపై సృష్టి లేదు. జీవరాశులు లేవు. కనుక - ఈ సృష్టి ఉన్నంత వరకు ఈ రామాయణం ఉంటుంది. "యావత్ స్థాస్యంతి గిరయః" ఈ కొండలు, ఈ సముద్రాలు, ఈ నదులు, ఈ సృష్టి ఉన్నంతకాలం రామాయణం ఉంటుందని వాల్మీకి చెప్పాడు. అది ఒక శాశ్వత గాథ.

ఒకవేళ ఎవరైనా దీని పరమార్థాన్ని గ్రహించ లేకపోతే, దీన్ని గురించి భ్రమపడితే— దాని ప్రభావం ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి మనకు మద్రాసు

నగరం చాలు. రాముడిని నిందించి, సీతను నిందించి, రావణాసురుడికి పూలమాలలు వేయకూడదా అని ప్రశ్నించిన కారణంగా, రామ కళ్యాణం జరగని కారణంగా— అక్కడ వానధార కురియలేదు. మంచినీటి చుక్క దొరకలేదు భద్రాద్రి రాముడు తెలుగుగంగను పంపితే తప్ప దిక్కులేని స్థితి వచ్చింది. ఓ మద్రాసు పౌరులారా! మీరీ సత్యాన్ని గ్రహించి, భద్రాద్రి రాముడు అనుగ్రహించి, మీకు మంచినీటి చుక్క దొరకాలని మేము ప్రార్థిస్తున్నాము.

కనుక సీతారామ తత్త్వము వెనుక ఎన్నో పసులు, వందలు తత్త్వములు, కథలు మేళవింపబడి ఉన్నాయి. తొందరపడి నిందించకండి. కానీ ఆధునిక కాలంలో మానవుడు తొందరపడి విమర్శిస్తున్నాడు. దాని లోపలకు వెళ్ళిచూచే ఓర్పును, నేర్పును కోల్పోతున్నాడు. దానిలోనికి ప్రవేశించకుండానే దానిని నమ్మను అంటు న్నాడు. మీకు ఏమి తెలిసిందని దానిని నమ్మరు?

రామాయణంలో సీతారాముల కళ్యాణానికి ముందు అహల్య కథ వచ్చింది. అహల్య అంటే దున్నబడుటకు వీలుకాని భూమి. పాషాణ స్థితిలో ఉన్న భూమి. శిలవంటి స్థితిలో, శాపగ్రస్తమైన స్థితిలో, శాప విమోచనంకోసం ఆ అహల్య ఎదురు చూస్తున్నది. 'రామా, నీ పాద స్పర్శ కావాలి' అంటున్నది. తొలకరి జల్లు పడక పోతే నాగటి చాలు దిగేనా? ఈ అహల్య హల్యగా (నాగలి దిగే భూమిగా) మారేనా? సీత అనే నాగటి చాలు వచ్చేనా? ఆ నాగటి చాలుకు నీలమేఘునికి వివాహం జరిగేనా? బంగారు పంటలు పండేనా? లవము, కుశము అను పేర్లతో పొలంలో వరిమొక్కలకు పిల్ల ఈనెలు దిగేనా?

కనుక, పొలంలో కూడ లవ-కుశలు మిగులుతారు— 'మేం ఉన్నాం మా అమ్మ తరపున; నాన్న తరపున' అని. ఓ వ్యవసాయదారులారా! మీరు చేసేది 'సీతారామ కళ్యాణం!' అని మీకు తెలుసా? తెలిస్తే మీరు వ్యవసాయం మానిపేసి బస్తీలకు రాగలరా?

కనుకనే- వ్యవసాయంలో, పంట పొలంలో, పైరచేల మధ్య ఉండే తృప్తి మరెక్కడా ఉండదు. ఈ భూమికి తొలకరి జల్లు పడినప్పుడు పుండే తృప్తి మరెప్పుడు ఉండదు. అలాంటి సీతారామ కళ్యాణంకోసం ఈ భూమి ప్రతిసంవత్సరం ఎదురు చూస్తూనే ఉంటుంది. ప్రతి సంవత్సరం ఆ కళ్యాణం జరుగుతూనే ఉంటుంది. పంటలు పండుతూనే ఉంటాయి. ఆ అమ్మవారి వైభవంతో మన బ్రతుకులు ఇంత కడతేరుతూ ఉంటాయి.

ఈ రామ కళ్యాణం వెనుక మరో కథ ఉన్నది.

మానవ జన్మ ఎత్తిన తర్వాత, మనస్సు, ఇంద్రియములు ఏర్పడిన తర్వాత- మనస్సులో అహంకారం అనే రావణాసురుడు ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు అనే తలలతో, 'ఈ దేహం, ఈ ప్రాణం, ఈ శక్తి నావి' అని బలాత్కరించాడు. అహంకారం అనే రావణాసురుడు 'ఈ దేహం, ఈ ప్రాణం, ఈ శక్తి, ఈ సీత నాది. నేను ఎత్తుకుపోతాను. అనుభవిస్తాను' అని తరలించిన రోజున - ఆ లోపల దిగివచ్చిన దైవస్వరూపమైన శ్రీరామచంద్రుడు సీతా-సీతా అని శోకిస్తున్నాడు. అంటే మనం ఎందుకో దిగి వచ్చాము. మన జన్మ సాఫల్యం తెలిసి బ్రతకకుండా మన అహంకారం సీతాదేవిని ఎత్తుకు వెళ్ళింది. మన ప్రవృత్తి, మన ఇంద్రియములు, మన ప్రాణశక్తి, మన జీవితము మన చేతులలో లేదు. రావణాసురుని చేతులలోనికి వెళ్ళిపోయింది. ఆ సీత కనబడడం లేదు. సీతారాముల ఎడబాటు వచ్చింది అని ఆ లోపల హృదయగతుడైన రాముడు దుఃఖిస్తున్నాడు. కిష్కింధ కొండలో వాయుపుత్రుడు దొరికాడు. 'నేను వెదికి పెడతాను సీతాదేవిని, నేను నీ బంటును' అన్నాడు.

ఇక్కడ సమస్త యోగశాస్త్ర సంకేతములన్నీ నిక్షిప్తమై ఉన్నాయి. బయట వాయువు ఉన్నాడు. మన ఊపిరితిత్తుల లోనికి వెళ్ళివస్తున్న వాయువు ఉన్నాడు. బయట వున్న వాయువుకు, లోపలకు వెళ్ళివస్తున్న వాయువు ఏమవుతాడు? కుమారుడు అవుతాడు. వాయుపుత్రుడు అవుతాడు.

ఆ వాయుపుత్రుడు అన్నాడు - 'హృదయగతుడవైన ఓ రామచంద్రుడా! అమ్మవారి జాడ తెలుసుకుని, ఆమెను చూచి వచ్చే కర్తవ్యం నాది.' ఆయన సముద్ర లంఘనం చేశాడు. లంకా సందర్శనం చేశాడు. అమ్మవారిని చూశాడు.

ఉచ్ఛ్వాస-నిశ్వాస స్వరూపుడైన ఆ హనుమంతుడు సీతారాములను కలిపిన వేళ - మానవ జీవితంలో మరల సీతారాముల కళ్యాణం జరుగుతుంది.

కనుక మానవులారా! మానవజన్మ ఎత్తినందుకు మానవ జన్మకు తగినట్లు మనం బ్రతుకుదాం. మధ్యలో అహంకారమనే రావణాసురుడు లేచాడు. మన ప్రకృతి అనే అమ్మవారిని ఎత్తుకొనిపోయాడు. మనం ఎక్కడో ఉన్నాం. ఇద్దరికీ ఇష్టంలేని స్థితిని మనం అనుభవిస్తున్నాం. ఉచ్ఛ్వాస-నిశ్వాస స్వరూపుడైన హనుమంతుడు ఉన్నాడు. అష్టాంగయోగ విధానంలో మీరు వాయుపుత్రుడిని నమ్మినవేళ, ఎక్కడో

అశోకవనంలో వున్న సీతకు, హృదయగతుడైన పురుషునికీ వాయుపుత్రుడు ప్రాణాయామ స్వరూపుడై అనుసంధానం కుదిర్చిన వేళ - అహంకారమనే రావణాసురుని ఇంద్రియములు అనే పది తలలు సర్దుకుంటాయి. రావణాసురుడనే అహంకారం అణగి ఉంటుంది.

ఇలా యోగపరంగా మానవ జీవితంలో సీతారామ కళ్యాణం జరుగవలసి ఉన్నది.

ఈ విధంగా - లోకానికి ఆదర్శప్రాయంగా ఉన్న సీతారాముల కథ ఉన్నది. ప్రతి సంవత్సరం నాగేటి చాలుకు—నీలమేఘానికీ కళ్యాణం సీతారాముల కథగా నడుస్తున్నది. ప్రతి జీవితంలో ప్రకృతి పురుషుల కళ్యాణంగా, జగత్ కళ్యాణంగా సీతారాముల కథ నడుస్తున్నది. కనుక, త్రేతాయుగం నాటి సీతారాముల కథ మనకు ఆదర్శం.

సీతారాముల కథను ఇలా అనేక స్థితులలో, అనేక గతులలో మనం చదువుకొనవలసి ఉన్నది. కనుకనే-ఒక రామాయణం కాని: ఒక మహాభారతం కాని చెప్పినప్పుడు, దీనిని ఫలానా లోకంలో ఫలానా ఋషి చెప్పాడు అంటారు. అనగా— సీతారాముల కథ ఒక లోకం. నీలమేఘుని కథ ఒక లోకం. ప్రకృతి పురుషుల జీవ కళ్యాణం కథ ఒక లోకం. ఇన్ని లోచనాలతో మనం ఈ కథను చూడాలి. ఈ కథ ఆనాటి నుంచి నేటి వరకు మన వద్దకు నడచి రావడానికి ఎంత పునాది ఉన్నదో ఆలోచించాలి.

ఈ సీతారాముల దివ్య స్వరూపాలను మనం మరల స్మరించుదుము గాక. భూమికి మానవుడుగా దిగివచ్చి, మనలా జీవిస్తూ, మనలా ప్రేమించి, మనలా ప్రవర్తించి, మనలా కష్టసుఖాలు పొంది, మనకు దారిచూపిన ఆ దేవునికి మనం నమస్కరించుదుము గాక. మానవులలో ఒకడై, మానవునిలా కోపం, ద్వేషం, ఇష్టం, కష్టం, సుఖం, దుఃఖం పొందుతూనే అన్నింటి మధ్యనుండి ధర్మాన్నిమాత్రం విడవకుండా ఎలా పట్టుకోవాలో తెలియజెప్పిన ఆ రామునకు, ఆ దేవునకు నమస్కారం.

రాముడు అందువల్ల దేవుడైనాడు. 'కష్టాలు, దుఃఖాలు, ఇబ్బందులు వచ్చాయి, ఇక సాధన సాగడం లేదు' - అనే మాటలు రాముని వద్ద లేవు. 'కష్టం వస్తే ఏడుస్తాను, బాధపడతాను, క్రుంగిపోతాను, క్షోభిస్తాను తప్ప - ధర్మాన్ని మాత్రం విడిచి పెట్టను' అన్నాడు రాముడు. ఇన్ని రాగద్వేషాలలో నుంచి, కష్ట సుఖాలలో

నుంచి, రకరకాల మానవ మనస్తత్వాల మధ్య నుంచి ఆ ధర్మసూత్రాన్ని శ్రీ వెళ్ళిన నిష్ఠకు, దీక్షకు, సమర్థతకు మనం అంజలి ఘటిద్దాం.

'జీవించడానికి మాకింత దారి చూపావు' అంటూ, ఆ దారివెంట నడ ప్రతి సంవత్సరం సీతారామ కళ్యాణం జరుపుకుంటూ, జీవితమే రామమ జగమే రామమయం అనే దివ్య స్థితిని మనం పొందగలిగినవేళ— జీవితం ర మయం అవుతుంది. అలాంటి స్థితికి ప్రేరణ ఇవ్వడంకోసం యుగాలతరబడి న వస్తున్నది రామ కథ.